# 'సింథాల్ గురించి ఉత్తమ విషయం జి-11 హెక్సాక్లోరోఫిన్ అంటారు

INTERPUB/GCS




# కాని నేను దానిని సువాసన కోసం కొంటున్నాను'

ఆహా! శరీరంపై వుండే ఆనందజనకమైన ఆ సువాసన...సింథాల్‌తో స్నానాంతరం హాయిగొలిపే పరిశుభ్రత నాకు పరమప్రీతి.




సింథాల్‌యందు గల జి.11 (హెక్సాక్లోరోఫిన్) మురికి మరియు చెమట వల్ల ఉద్భవించే క్రిములను నిర్మూలిస్తుంది. మీ శరీర దుర్గంధమును తొలగిస్తుంది.




మీరీ రూఢిగా నమ్మండి-రోజల్లా హాయిగొలిపే పరిశుభ్రంగా వుండుటకు జి-11 (హెక్సాక్లోరోఫిన్) గల సింథాల్ సబ్బును మరియు టాయిలెట్ పౌడర్‌ను వాడండి.

జి.11, ఎల్. జివౌడా ఇంక్. యు. ఎస్. ఎ. వారి ట్రేడ్ మార్కు


U-FOAM
ఆధునిక
జీవితానికి
యు-ఫోమ్









# తొలిమాట

శ్రీమతి యద్దనపూడి సులోచనారాణిగారి తొలి నవల సెక్రటరీ వలెనే "జ్యోతి" పాఠకులను అమితంగా అలరించిన ఆమె రెండవ నవల విజేత ఈ సంచికతో సమాప్తమైంది. నవలా రచయితకు కావలసిన ప్రప్రథమ నైపుణ్యం పాఠకులచే ఆసక్తితో చదివించగలగడం. దీనిలో అంటే కథా కథనంలో తనకు సాటిరా ఎవరు ఈనాటి యువతరం రచయితలలో బహు కొద్దిమంది మాత్రమేనని ఈ రచయిత్రి తన రెండు నవలలతో నిరూపించుకున్నారనడం అతిశయోక్తి కాదు.

*　　　*　　　*

"జ్యోతి" పాఠకులకు సుపరిచితులైన రచయిత శ్రీ బి. వి. రమణరావుగారి ప్రహసనం "ప్రేమ వ్యూహం" జనవరి సంచికలో ప్రారంభమవుతుంది. ప్రదర్శనకు అనుకూలమైన ఈ రూపకం రెండు అవసరమైతే మూడు సంచికలలో సీరియల్‌గా వేస్తాము.

*　　　*　　　*

వచ్చే సంచికతో "జ్యోతి"కి నాలుగేళ్ళు వెడతాయి. ఈ సందర్భంలో కొన్ని కొత్త శీర్షికలు ప్రవేశ పెట్టాలని యోచన.




JYOTI HAS BEEN MAKING HISTORY FOR THE PAST THREE YEARS AND A HALF. THE FIGURES SPEAK FOR THE FACTS.

| | | |
|---|---|---|
| 1964 | Jan - June | 9,441 |
| 1964 | July - Dec | 12,813 |
| 1965 | Jan - June | 15,620 |
| 1965 | July - Dec | 18,971 |
| 1966 | Jan - June | 20,323 |



సుచిత్ర మాసపత్రిక

బకింగ్‌హామ్ పేట పోస్టు

విజయవాడ-2

విడిప్రతి వెల

75 పైసలు

ఏడాది చందా

9 రూపాయలు

సంపుటి 4

డిసెంబర్ 1966

సంచిక 12

మేనేజింగ్ ఎడిటర్

వి. వి. రాఘవయ్య




# ఉధృతంగా కొనసాగిన ఉక్కు ఫ్యాక్టరీ ఉద్యమం

నెల - నెల పదిహేను రోజులుగా ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు ఉక్కు-ఫ్యాక్టరీ నినాదాలతో ప్రతిధ్వనించాయి. ఏ చోట, ఏ నోట విన్నా ఒకే మాట - "విశాఖ ఉక్కు, ఆంధ్రుల హక్కు" అంటూ.

అంతకు ముందునుంచి ఈ నినాదం ఆంధ్రుల హృదయాలలో రగులుకుంటూనే వుంది. అయినా, విశాఖపట్టణంలో శ్రీ అమృతరావు ఉపవాస దీక్షతో ఒక్కసారిగా ఆంధ్రదేశమంతా భగ్గుమంది.

అయిదవ ఉక్కు ఫ్యాక్టరీ విషయంలో ఆంధ్రులకు కేంద్రం అన్యాయం చేసిన మాట కాదనడానికి వీలులేదు. ఆ ఫ్యాక్టరీని విశాఖపట్టణంలో నిర్మించే అవకాశం వున్నదని, నిర్మించడం తథ్యమనికూడా కేంద్రంలో ఉక్కుశాఖమంత్రి మొదట ప్రకటించారు. అంతకు ముందునుంచికూడా అయిదవ ఉక్కు ఫ్యాక్టరీ ప్రస్తావన వచ్చినప్పుడల్లా రేవు ప్రాంతాలైన విశాఖపట్టణం, గోవాల పేర్లే వినిపిస్తూ వచ్చాయి. దీన్నిబట్టి విశాఖపట్టణంలో స్థాపన తప్పదని ఆంధ్రులు ఆశలు పెంచుకుంటూ వచ్చారు. కేంద్ర మంత్రి ప్రకటనలు, వాటినిబట్టి రాష్ట్ర మంత్రుల ప్రకటనలు, రాష్ట్ర ప్రభుత్వం సన్నాహాలు ఈ ఆశలను పోషిస్తూ వచ్చాయి.

కాని, మధ్యలో ఇదంతా తలకిందులైంది. విశాఖపట్టణానికి, తద్వారా ఆంధ్రదేశానికి ఇంత బ్రహ్మాండమైన ఫ్యాక్టరీ ఎందుకు రావాలని - ఎప్పుడు, ఎవరికి అసూయ పుట్టిందోగాని, మరి మూడు పేర్లను కూడా రంగంలోకి విసిరెయ్యడం జరిగింది. అవి హోస్పేట, బైలదిల్లా, సేలం.

దీనితో ఈ సమస్య వివిధ రాష్ట్రాల మధ్య వివాదాస్పదంగా తయారైంది.

ముఖ్యంగా మద్రాసు, మైసూరు, ఆంధ్ర ప్రదేశ్‌ల మధ్య తగాదాగా పరిణమించింది.

అప్పుడు కేంద్ర ప్రభుత్వం అయిదవ ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణంపై ఆసక్తి కలిగిన ఆంగ్లో - అమెరికన్ నిపుణుల బృందానికి ఈ సమస్యను అప్పగించింది. గోవా, హాస్పేట, సేలం, నైవేలి, విశాఖపట్టణం, బైలదిల్లా - ఈ ఆరు ప్రదేశాలను పరిశీలించి ఏది ఎక్కువ అనుకూలమో నిర్ణయించవలసిందిగా దాన్ని కోరింది.

ఈ బృందం ఆరు స్థలాలను క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాత ఒక నివేదికను సమర్పించింది. దానిలో అయిదవ ఉక్కు ఫ్యాక్టరీని సముద్ర తీర ప్రాంతంలో నిర్మించడమే మంచిదని, ఇందుకు అర్హమైన విశాఖపట్టణం, గోవాలలో కూడా విశాఖపట్టణమే అన్ని విధాల ఎక్కువ అనుకూలమని సూచించింది.

తీర ప్రాంతంలో కాక, దేశంలోపలి ప్రదేశంలో నిర్మించదలిస్తే అన్నిటిలోకి హాస్పేట మాత్రమే అందుకు తగినదనికూడా నిపుణుల బృందం సూచించింది. అంటే, తీర ప్రాంతంలో అయితే విశాఖపట్టణం, లోతట్టు ప్రాంతమైతే హాస్పేట తగినవన్న మాట. కాని, ఈ రెండింటిలో కూడా విశాఖపట్టణమే ఉత్తమ స్థలమని, దానికే తాము ఆర్థికంగా సహాయపడగలమనికూడా నిపుణుల బృందం తెలియజేసింది.

ఈ బృందానికి విశాఖపట్టణంమీద ఏదో మమకారం వుండవలసిన అవసరం లేదు. ఉక్కు ఫ్యాక్టరీ ఏ రాష్ట్రానికి పోయినా వారి కొకటే. దాన్ని అన్ని విధాల అనుకూల స్థలంలో నిర్మించడమే వారికి కావలసింది. అందుచేత తాము పరిశీలించిన ఆరు స్థలాలలోకి విశాఖపట్టణాన్నే ఎందుకు ఎంచవలసి వచ్చిందో కారణాలు నిరూపిస్తూ వారు నివేదిక సమర్పించారు.

అక్కడితో ఈ వివాదం ఆగిపోవలసిందే. కాని ఆగలేదు. మరింత ఎక్కువైంది. నిపుణుల నివేదికను బుట్టదాఖలు చేసి తమకే ఉక్కు ఫ్యాక్టరీని ఇవ్వవలెనని మైసూరు, మద్రాసు కూడా వాదించడం ప్రారంభించాయి. ఇది కేవలం జబర్దస్తీ ధోరణిలో సాగింది.

ఇంతలో కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజ్ మరొక ఊహను గాలిపటంలా ఎగరేశారు. తుని తగవుగా, అయిదవ ఉక్కు ఫ్యాక్టరీ అనేదే లేకుండా దాన్ని మూడు ముక్కల్ని చేసి మూడు రాష్ట్రాలకు పంచిపెట్టవచ్చునని ఆయన సూచన. మైసూరు, మద్రాసులకు ఇది వెంటనే నచ్చింది. నచ్చక ఏం చేస్తుంది? విశాఖపట్టణానికి పెద్ద ఫ్యాక్టరీ పోకుండా వుంటేచాలు. తమకు రాకపోయినా ఫరవాలేదు. వస్తే చిన్నది వచ్చినా చాలు.

కాని, ఆంధ్రప్రదేశ్‌కు మాత్రం ఇది బొత్తిగా ఇష్టం కాలేదు. ఇస్తే పెద్ద ఫ్యాక్టరీని ఇవ్వాలి, చిన్నది అక్కరలేదని స్పష్టం చేసింది. అప్పట్లో ఆంధ్ర ప్రదేశ్‌లో పర్యటించిన

ప్రధాని స్వర్గీయ లాల్‌బహదూర్ శాస్త్రి కూడా ఉక్కు ఫ్యాక్టరీ విషయమై మాట్లాడుతూ "నిపుణుల నివేదికను కేంద్ర ప్రభుత్వం త్రోసివేయలేదు" అన్నారు. డొంక తిరుగుడుగానైనా విశాఖపటణంలో నిర్మించగలమనేగదా దీని అర్థం?

ఇదంతా జరిగి ఏడాది కావస్తోంది. అప్పటికి ఇప్పటికి ఈ సమస్య తేలనేలేదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు వుంది కేంద్రంలోని ఉక్కు శాఖలో మంత్రులు మారుతున్నారు. ప్రధానులుకూడా మారుతున్నారు. నిపుణుల నివేదికపై కేంద్రం నిర్ణయం ఇదిగో వస్తుంది. అదుగో వస్తుంది అని ఆంధ్రులు ఏనెల కానెల ఎదురు చూస్తున్నారు. ఇలా ఏడాది గడిచి పోయినా నిర్ణయం రాలేదు.

ఇంతలో ఈ విషయమై కేంద్రాన్ని ఒప్పించాలనే పట్టుదలతో గుంటూరు, గాంధీమిషన్ స్థాపకుడు శ్రీ టి. అమృతరావు విశాఖపట్టణంలో కలెక్టరు కార్యాలయం ఎదుట నిరాహార దీక్ష ప్రారంభించారు. పది రోజులయ్యే వరకు ఆయన్ని పెద్దగా పట్టించు కున్నవారు లేరు.

నెమ్మదిగా వేడి అందుకుంది. విద్యార్థులు ఉద్యమానికి నాయకత్వం వహించారు. ఆ తర్వాత జరిగిన అల్లకల్లోలం అందరికీ తెలిసిందే.

మొదట ఉద్యమం ప్రశాంతంగానే ప్రారంభమైంది. సమ్మె చేయడం, రైళ్ళు ఆపివేయడం, ప్రదర్శనలు, ఊరేగింపులు ఆంధ్ర దేశంలో అన్ని జిల్లాలలో, అన్ని వూళ్ళలో జరిగాయి. ఇటువంటివి ప్రారంభమైనప్పుడు అదుపు తప్పిపోవడం జరగకుండా మానదు. ఆంధ్రరాష్ట్రంకోసం జరిగిన ఆందోళన తరవాత ఇంత భారీ ఎత్తున ఏ ఉద్యమం మన ప్రాంతంలో జరగలేదు. ఉద్రేకాలు పెరిగిపోయాయి. ఉద్యమాన్ని అడ్డుపెట్టుకుని రైలు స్టేషనులను తగలపెట్టడం, షాపులను లూటీ చేయడం వరకు వెళ్ళింది. సంఘ విద్రోహ శక్తులు విశృంఖల విహారం చేశాయి. పోలీసులు లాటీ ఛార్జీ, కొన్ని చోట్ల కాల్పులు చేయడం జరిగింది. మొత్తం 24 మంది చనిపోయారని అధికార వరాల అంచనా. కాదు, 32 మంది చనిపోయారని ప్రతిపక్షాల లెక్క. ఏమైనా ఇటీవల ఏ ఉద్యమం సందర్భంలోనూ ఇంతమంది మరణించడం జరగలేదు. రైల్వేలకు జరిగిన ఆస్తినష్టం కొన్ని కోట్ల రూపాయల వరకు వుంటుందని మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ ప్రకటించారు.

పది రోజుల పాటు రాష్ట్రంలో రైళ్ళ రాకపోకలు ఆగిపోయాయి. బస్సులు ఆగిపోయాయి. టెలిగ్రాఫ్ సౌకర్యాలు, తపాలా బట్వాడా నిలిచిపోయాయి. రాష్ట్రంలో పౌరజీవితం కొన్ని రోజులపాటు ఎక్కడికక్కడ బంద్ అయిపోయింది.

చివరకు శ్రీ అమృతరావు ఆరోగ్య పరిస్థితి విషమించింది. ఇంతలో న్యూఢిల్లీ నుంచి ఒక వార్త వెలువడింది. ఉక్కు ఫ్యాక్టరీ సమస్యను పరిశీలించడానికి కేంద్ర ప్రభు

త్వం నియమించిన క్యాబినెట్ సబ్ కమిటీ విశాఖపట్టణంలో ఫ్యాక్టరీకి అనుకూలంగా నిర్ణయం చేసిందని ఆ వార్త. మర్నాడు ఆ నిర్ణయాన్ని కేంద్ర మంత్రివర్గం ఆమోదించిందని ఇంకొక వార్త. ఆంధ్రులు తమ ఆందోళన ఫలించిందని బ్రహ్మానంద భరితులయ్యారు. ముఖ్య మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ఈ వార్తలను ప్రచురించిన పత్రికలను పట్టుకుని హుటా హుటిగా విశాఖపట్టణం వెళ్లారు. శ్రీ అమృతరావుకు వాటిని చూపెట్టి నిరాహారదీక్షను విరమింప జేశారు.

ఇక్కడితో యాంటీ క్లయిమాక్స్ ప్రారంభమైంది. కేంద్ర ప్రభుత్వ నిర్ణయం వార్త రావడంతో, శ్రీ అమృతరావు నిరశన దీక్ష విరమించడంతో ఉద్యమం చప్పబడి పోయింది.

న్యూఢిల్లీ నుంచి ఆ వార్తలు ఎలా వచ్చాయో ఇప్పటికీ మిస్టరీగానే మిగిలిపోయింది. వాటిని దేశంలోని రెండు పెద్ద వార్తాసంస్థలు పంపించాయి; పత్రికలన్నీ వాటిని ప్రచురించాయి. ప్రజలు నమ్మారు. బ్రహ్మానందరెడ్డిగారు కూడా నమ్మారా, లేక నమ్మినట్లు నటించారా అన్నది ఇంకొక మిస్టరీ. కేంద్రం అటువంటి నిర్ణయమేదీ చేయలేదని ఆయనకు తెలుసునని, కాని పత్రికలు ప్రచురించేసరికి అమృతరావు దీక్షను మాన్పించడానికి ఇదే అదనని భావించారని కొందరు చెబుతున్నారు. లేదు, పాపం ఆయన అసలే అమాయకుడు, నిజంగానే తనుకూడా నమ్మాడని మరి కొందరు చెబుతున్నారు. నిజం ముఖ్యమంత్రికే తెలియాలి.

ఏ మైనా, ఆంధ్రలో ఉద్యమాన్ని ఉపశమింప జేయడానికి, ఆ తరవాత దాన్ని అణచివేయడానికి కేంద్రంలో ఎవరో ఈ బ్రహ్మాండమైన ఎత్తు వేశారన్నది క్రమంగా ప్రజలకు అర్థమవుతోంది. ఎందుకంటే ఉద్యమం ఉధృతం తగ్గగానే, "అబ్బే అటువంటి నిర్ణయమేదీ జరగలేదు. ఆ వార్త అబద్ధం" అని న్యూఢిల్లీనుంచి ప్రభుత్వ ప్రకటన వెలువడింది. క్యాబినెట్ సబ్ కమిటీ సమావేశం జరిగినమాట నిజమే. మరి ఏ నిర్ణయం చేయకుండా వుండడానికి సమావేశం జరిపినట్లు అనుకోవాలి.

ఆ దరిమిలా ప్రధాని ఇందిరాగాంధీ కూడా ప్రకటనలు చేశారు. వాటి సారాంశం ఒకటే: అయిదవ ఉక్కు-ఫ్యాక్టరీని స్థాపించే అవకాశం ఇప్పుడు లేదు. దీనికి కారణం_డబ్బులేదు. ఇప్పుడున్న ఉక్కు-ఫ్యాక్టరీలను విస్తృతం చేసుకుని వాటినుంచి అధిక ప్రయోజనాలను రాబట్టుకోవాలని మాత్రమే ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

అయితే, ఆమెగాని, ఉక్కు-శాఖ మంత్రిగాని ఎన్ని ప్రకటనలు చేసినా ఒక విషయంమాత్రం దాచేస్తున్నారు. ఆంధ్రుల సూటిప్రశ్నకు సూటిసమాధానం చెప్పకుండా తప్పించుకు పోతున్నారు. ఆంధ్రులు కోరుతున్నది ఏమిటి : ఉక్కు-ఫ్యాక్టరీకి డబ్బులేదన్న మాట నిజమే కావచ్చు. దాన్ని డబ్బున్నప్పుడే, మీ యిష్టం వచ్చినప్పుడే స్థాపించండి. కాని, ఆ స్థాపించేది మాత్రం విశాఖపట్నంలోనే స్థాపిస్తా

మని హామి ఇవ్వండి. అది చాలుమాకు. ఇదీ ఆంధ్రులవాదం.

దీనికి కేంద్రం నుండి సమాధానం ఇది: ఉక్కు ఫ్యాక్టరీని ఇప్పుడు స్థాపించడానికి డబ్బులేదు.

డబ్బులేందే స్థలాన్ని నిర్ణయించడానికి వీలులేదా? దీనికి సమాధానం లేదు.

విశాఖపట్నంలో స్థాపించడానికి మీ కిష్టం లేదా? దీనికీ జవాబు లేదు.

ఆంధ్రులకు ఎగనామం పెట్టడానికి కేంద్రంలో కుట్ర జరిగిందని దీని తర్వాత ఎవరైనా ఆరోపిస్తే తప్పులేదు.

ఆంధ్రదేశానికి వ్యతిరేకంగా పని చేస్తున్న కొన్ని ప్రబల శక్తులేవో వున్నాయి. ఇవి కేంద్ర ప్రభుత్వపు ఉక్కు శాఖలోను, బయటా కూడా వున్నాయి.

ఏమైనా, ఇంత ఆందోళన జరిగిన తర్వాత శ్రీ అమృతరావు శ్రీ బ్రహ్మానందరెడ్డి, రాష్ట్ర మంత్రివర్గం ప్రదేశ్ కాంగ్రెసు ప్రతిపక్షాలు, విద్యార్థులు, ప్రజలు అంతా తెల్లమొహాలు వేయక తప్పలేదు. ఇందరినీ బ్రహ్మాండంగా బోల్తా కొట్టించారు. కేంద్ర ప్రభుత్వం ఇన్నేళ్ళుగా ఏం సాధించినా, సాధించకపోయినా ఇది మాత్రం తను సాధించిన ఘన విజయంగా గర్వపడవచ్చు.

* * *

ఈ అవమానానికి ప్రతీకారంగా రాష్ట్ర మంత్రివర్గం, శాసన సభ్యులు, కేంద్రంలోని ఆంధ్ర మంత్రులు, పార్లమెంటు సభ్యులు రాజీనామా చెయ్యాలని మరొక నినాదం బయలుదేరింది. అయితే, అన్నంత తేలిక కాదు ఈ పని. బ్రహ్మానందరెడ్డిగారు ఉద్రేకంగా మాట్లాడగలరుగాని, ఉద్రేకంతో పని చెయ్యలేరు. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందంటారు. కేంద్రం చేసిన అవమానానికి ప్రతిక్రియగా రాజీనామాచేస్తే ఎవరికి నష్టం? ఎవరికి పరువుతక్కువ? కాంగ్రెసుకే గదా?

ఎన్నికలు మరి మూడు నెలల్లో రాబోతున్నాయి. కాంగ్రెసు ఇదివరకే అప్రతిష్ఠపాలై పోయింది. దానికి తోడు ఇప్పుడు రాజీనామాలుకూడా చేస్తే ఇంకేముంది? అయినా, కోపం ఎవరిపై చూపిస్తారు? తమపై, తమ పార్టీపైనే గదా? ఇది ఎలా సాధ్యం?

అంతేకాదు. ఎలాగూ ఎన్నికల వరకే ఈ పదవులుగదా అని రాజీనామాలు చెయ్యడానికి వీలులేదు కూడా. పదవిలో ఎవరుంటే వారిదే పైచెయ్యి. వారి మాటకే విలువ. ప్రదేశ్ కాంగ్రెసులో ఇంకా టిక్కెట్ల గొడవ తేలలేదు. కేంద్రానికి అయోధ్య, సయోధ్య వర్గాలు రెండూ అభ్యర్థుల జాబితాలు పంపించాయి. వారు కొందరికి నిరాకరించారు. వీరు కొందరికి నిరాకరించారు. ఎవరి ఇష్టులను వారు తమ లిస్టులలో వేసుకున్నారు. మాది మంచి జాబితా అంటే, మాది అసలైన జాబితా అని పోటీ పడుతున్నారు. ఈ సమయంలో పదవులు కాస్తా వదిలేస్తే తమ మాట వినిపించుకునే వారు కూడా

వుండదు. ఎన్నికలలో తమ తమ అభ్యర్థులను గెలిపించే అవకాశం కూడా వుండదు ఇవన్నీ ఆలోచించే రాజీనామాల ప్రసక్తికి ఎవరూ పోలేదు.

రాష్ట్రంలో బ్రహ్మానందరెడ్డిగారిని అప్రతిష్టపాలు చెయ్యడానికి కేంద్రంలో సంజీవరెడ్డిగారు చేసిన గూడుపుఠాణీ ఫలితమే మనకు ఉక్కు ఫ్యాక్టరీ రాకపోవడం అని అనేవారూ కొందరున్నారు.

అలాగే ఆంధ్రకు ఏకైక నాయకుడినని చెప్పుకుంటున్న సంజీవరెడ్డిగారు కేంద్రంలో వుండికూడా ఒక్కసారైనా నోరెత్తలేదు. ఆయన చేసిన ఘనకార్యం ఏమిటని బ్రహ్మానందరెడ్డి వర్గంవారూ ప్రశ్నిస్తున్నారు.

* * *

ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఆఖరి సమావేశం పూర్తయింది. ఇంతవరకెప్పుడూ లేనివిధంగా మొదటి రోజునే ప్రతిపక్షాల గొడవ. సభ వాయిదా వేయడం జరిగింది. ఇటీవల జరిగిన ఉక్కు ఫ్యాక్టరీ ఉద్యమం సంఘటనలపై ప్రభుత్వ పక్షానికి, ప్రతిపక్షాలకు తీవ్రమైన వాగ్యుద్ధాలు జరిగాయి. ప్రభుత్వ పక్షం చాలా ధైర్యం ప్రదర్శించి తన వైఖరిని, తన ప్రవర్తనను సమర్థించుకోవడానికి యత్నించిందిగాని, ఇందులో సమర్థించదగింది, సమర్థించగలిగింది ఏమీ లేదని దానికీ తెలుసు. చివరికి ప్రతిపక్షాల సభ్యులు 69 మంది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వైఖరికి నిరసనగా రాజీనామా లిచ్చారు. మరికొద్ది రోజులలో శాసనసభ కూడా నిరవధికంగా వాయిదా పడింది.

ఉక్కు ఫ్యాక్టరీ గొడవ రెండేళ్ళ కిందటో, ఏడాది కిందటో వచ్చివుంటే ఎలా వుండేదో? ఈపాటికి ప్రజలు మరచిపోయి వుండేవారేమో? కాని. సరిగ్గా ఎన్నికల ముందు వచ్చింది. ఇది పాలకపక్షం దురదృష్టమే. దీని ప్రభావం ఎన్నికలపై ఏ విధంగా వుంటుందో చూడాలి.

* * *

పాలక పక్షం దురదృష్టం ఒక్క ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాదు. మొత్తం దేశం అంతటా ఒకరకంగానే వుంది. ఏ రాష్ట్రంలో చూసినా దానిగీత ఏమీ బాగులేదు.

ముఖ్యంగా ఆహార సమస్య వాలుగైదు ఉత్తర రాష్ట్రాలలో చాలా తీవ్ర రూపం ధరించింది. యు. పి., బీహారులలో అనావృష్టి, అతివృష్టికూడా ఆహార సమస్యను తీవ్రం చేశాయి. ఖరీఫ్ పంట దెబ్బతింది. కొన్ని కోట్ల మంది ప్రజలకు దాదాపు క్షామమని చెప్పదగిన పరిస్థితు లేర్పడ్డాయి. ఇదే సమయంలో అమెరికా వచ్చే ఏడాదిలో మనం కోరిన ఆహారధాన్యాలను పంపిస్తుందో లేదో సందేహంలో పడింది. అవి అనుకున్న సమయానికి రాకపోతే, సరిగ్గా ఎన్నికల సమయంలో, అంటే ఫిబ్రవరిలో చాలా గడ్డు పరిస్థితి ఏర్పడుతుంది. రేషన్‌లను తగ్గించవలసి వస్తుందని ప్రధాని ఇందిరా గాంధి హెచ్చరించారు. ధాన్యం

పికరణను సమర్థంగా అమలు జరప కంద్వారా, కెనడా, ఆస్ట్రేలియా, రష్యా మొదలైన దేశాలనుంచి ధాన్యాలను తెప్పించుకోవడం ద్వారా ఈ ఆపద గట్టెక్కాలని ప్రభుత్వం భావిస్తోంది. ఏమైనా ఇది పెద్ద దురదృష్టమే.

★ ★ ★

కొన్ని నెలలుగా దేశంలో అరాజకంతో పోల్చదగిన అల్లకల్లోలం చెలరేగుతోంది. ఎప్పుడూ ఎక్కడ చూసినా ఏవో అల్లరులే. ముఖ్యంగా ఉత్తర రాష్ట్రాలలో కొన్ని వారాలపాటు విద్యార్థుల ప్రవర్తన ఒక పెద్ద సమస్యగా తయారైంది. వారిని యథార్థంగా బాధిస్తున్న సమస్యలేమిటో, వారికి ఏం కావాలో, ఏం అక్కరలేదో, ఎందుకు వారింత రెచ్చిపోతున్నారో, ఎందుకు సమ్మెలు, ప్రదర్శనలు చేస్తున్నారో ఎవరికీ అంతుపట్టలేదు.

నిజానికి, విద్యార్థులంత బుద్ధిమంతులు లేరని, దౌర్జన్య సంఘటనలకు వారెంతమాత్రం కారకులుకారని, సంఘ విద్రోహ శక్తులేవో చొరబడి ఈ గొడవలన్నీ లేవదీస్తున్నాయని కొందరన్నారు. ఆ సంఘ విద్రోహ శక్తులు మరెవరో కాదు, ప్రజాస్వామ్యంపై నమ్మకంలేని రాజకీయ పక్షాలేనని కొందరన్నారు. కాంగ్రెసును, దాని ప్రభుత్వాలను ఇరకాటంలో పెట్టడానికి ప్రతిపక్షాలు కుట్ర పన్ని విద్యార్థులను ఉపయోగించుకుంటున్నాయని కొందరన్నారు. ఇదేమీ కాదు, విద్యార్థులకు ప్రస్తుత విద్యా విధానంమీద నమ్మకం, భక్తి గౌరవాలు సన్నగిల్లాయి. అందుచేత క్రమశిక్షణ తప్పి ప్రవర్తిస్తున్నారని మరికొందరన్నారు. తప్పంతా విద్యార్థులదే, సినిమాలుచూసి చెడిపోతున్నారని కొందరు కూకలేశారు. అయితే, విద్యార్థులను చెడగొట్టే సినిమాలను తీస్తున్నవారిది, తీయనిస్తున్నవారిది తప్పుకాదా అని కొందరు ప్రశ్నించారు. విద్యార్థులకు నిజంగానే ఏవో అసంతృప్తి కారణాలున్నాయి. వారి పాఠ్య పుస్తకాలలో తప్పులుంటున్నాయి, వారి అధ్యాపకులు అసమర్థులు, వారికి - విద్యార్థులకు మధ్య సరైన సంబంధాలు లేవు. విద్యాలయాలలో విద్యా బోధనకు తగ్గ సౌకర్యాలు కరువౌతున్నాయి, అందుచేత క్రమశిక్షణ తగ్గిపోతోందని కొందరు వాదించారు. వైస్ ఛాన్సలర్లుగా సరైనవారిని నియమించడంలేదు, విశ్వవిద్యాలయాల వ్యవహారాలలో రాష్ట్ర ప్రభుత్వాలు జోక్యం చేసుకుంటున్నాయి, తప్పంతా వైస్ ఛాన్సలర్లది, ప్రభుత్వాలదీ నని కొందరు పసికట్టారు. అబ్బే, అదేం కాదు. విద్యార్థులను పోలీసులు మర్యాదగా చూడ్డంలేదు, అందుచేత విద్యార్థులు రెచ్చిపోతున్నారు. పోలీసులే కాదు, హోటళ్ళవారు, సినిమా హాల్స్‌వారు, ఇంకా ఇలా రకరకాలవారు విద్యార్థులను సరిగ్గా చూడ్డంలేదు, వారికి మరి కోపం వచ్చిందంటే రాదా అని కొందరన్నారు. చివరికి ప్రధాని ఇందిరా

శాంతి పత్రికలమీదికి దోషమంతా నెట్టే శారు. పత్రికలు విద్యార్థుల అల్లర్లను ఆర్భాటంగా, కాటికాయలంతేసి అక్షరాలతో ప్రచురించాయి, ఆ వార్తలు చూసి అల్లర్లు ఇదివరకు లేనిచోట్లకు కూడా ప్రాకాయి అన్నా రావిడ.

ఏమైనా, విద్యార్థుల చర్యలకు కారణాలు ఎవరికీ అంతు పట్టలేదు. ఎవరికి తోచినది వారు చెప్పుకున్నారు. ఇతర్లని ఖండించారు. తమదే రైటని, తాము చెప్పిన ఒక్క పాయింటుని అంతా గుర్తిస్తే అంతా చక్కబడి పోతుందని వాదించారు. హోం మంత్రి, విద్యా మంత్రి, వైస్ ఛాన్సలర్లు, ముఖ్యమంత్రులు అంతా చేరి సమావేశాలు చేశారు. చర్చలు జరిపారు. మళ్ళీ ఎవరి దోవన వాళ్ళు వెళ్ళిపోయారు. ఇప్పుడు సద్దుమణిగింది. అందుచేత మళ్ళీ ఏవో గొడవలు వచ్చేదాకా ఈ విషయాలను గురించి ఎవరూ పట్టించుకోరు. అప్పుడు మళ్ళీ ఆదరాబాదరా సమావేశాలు, చర్చలు, విద్యార్థులలో అశాంతికి అసలు కారణాలకోసం అన్వేషణ ప్రారంభమవుతాయి.

* * *

విద్యార్థుల ధాటికి కూడా తట్టుకోగలిగిన శ్రీ జి. ఎల్. నందా గోవు చేతిలో ఓటిపోవడం మాత్రం విచిత్రంగానే వుంది. అయితే ఆయన మంత్రి పదవిని ఎగరగొట్టింది నిజంగా గోవు కాదేమో.

గోవు హిందువులకు పరమ పవిత్రమైన జంతువు. వేదాలలో మొదటిదైన ఋగ్వేద కాలం నాటికే దాని వధ మహ పాపమని, దాని మాంసం భుజించరాదని, దాని పూజించాలనీ విశ్వాసాలేర్పడ్డాయి. వందల, వేల సంవత్సరాలు గడుస్తున్న కొద్దీ ఈ నమ్మకాలు గట్టిపడ్డాయితప్ప ఏమాత్రం సడలలేదు.

అయితే ఈ దేశం గోవధను నిషేధించాలని కోరుతున్న హిందువులది మాత్రమేకాదని, గోవుమాంసం తినడానికి అభ్యంతరం లేని ఇతర మతస్థులు—ముస్లింలు, క్రైస్తవులు, పార్శీలు, హిందువులలోనే షెడ్యూల్డు తెగలవారు, ఆదిమ జాతులవారు—మొత్తంపై కొన్ని కోట్లమంది కూడా ఈ దేశంలో వున్నారని, వారినిఫలానా ఆహారం తినరాదని శాసించే హక్కు హిందువులకెక్కడిదని ప్రశ్నించేవారు కూడా లేకపోలేదు. దీనికి హిందువులు సమాధానం చెప్పలేక పోతున్నారు కూడా. కేవలం తమకు పవిత్రమైన జంతువుకనుక ఇతరు లెవ్వరూ దాన్ని చంపి తినరాదని మాత్రమే వారి వాదం. తమ విశ్వాసం ప్రకారం ఇతర మతాలవారు నడుచుకోవాలని మాత్రమే వారి వాదం.

ఏ మతంలోను విశ్వాసంలేని మరి కొందరు—ఈ హిందువులు గోవును మాత్రమే ఎందుకు పవిత్రమైనదిగా భావించాలి? ప్రతిప్రాణి పరమాత్మ స్వరూపమేనని హిందూ వేదాంతం బోధించడం లేదా? అటువంటప్పుడు గోవులను మాత్రం వదిలిపెట్టి, మేకలు,

గొ[్రెలు, గేదెలు, కోళ్ళు, బాతులు మొదలైన వాటిని పరపర కోసి నిర్దయగా వండుకుని, సుష్టుగా భోజనం చెయ్యడానికి వీరికి ఎందుకు అభ్యంతరం లేదో? అని ప్రశ్నిస్తున్నారు. దీనికి హిందువు లివ్వగలిగిన సమాధానం మరేమీ లేదు: "మా యిష్టం. గోవు మాత్రమే మాకు పరమ పవిత్రం. దానిని ఎవ్వరూ చంపరాదు" అని.

ఎవ్వరూ చంపరాదంటే ఈ దేశంలోనివారు మాత్రమేనని అర్థం. ఇతర దేశాలలోవారు గోవులను చంపుతున్నా, తింటున్నా వీరు చేయగలిగిందేమీలేదు.

గోవధ నిషేధాన్ని తమ జెండాగా పట్టుకుని హంగామా చేస్తున్న రాజకీయ పక్షాలలో ముఖ్యమైంది - బహుశా ఏకైకమైంది - జనసంఘమే. వీరి దృష్టిలో ఈ దేశం అసలు హిందువులది. వారిది ప్రస్తుతం మెజారిటీ కూడా. ఇతర మతాల వారిని క్షమించి, సహించి, వుండనిచ్చినా పరిపాలన, చట్టాలు అన్నీ హిందువులే చెయ్యాలి. వారిదే రాజ్యాధికారం. వారిది మెజారిటీ కనక వారి ఇష్ట ప్రకారమే గోవధను నిషేధించాలి. ఈ వితండవాదంతో వారు పెద్ద ఉద్యమాన్ని లేవదీశారు.

ఈ ఉద్యమంలో భాగంగా నవంబరు 7వ తేదీన ఢిల్లీలో జరిగిన గొడవలు, సాధువుల తండాలు చెలరేగి నానా హంగామా చెయ్యడం, శాంతిభద్రతలను కాపాడలేక పోయినందుకు హోం మంత్రిగా వున్న శ్రీ జి. ఎల్. నందాపై అంతా విరుచుకు పడడం, ఆయన రాజీనామా ఇవ్వడం, ఆయన స్థానంలో శ్రీ వై. బి. చవాన్ హోం మంత్రి కావడం, ఇంకా ఏవేవో మార్పులు జరగడం అందరికీ తెలిసిందే.

నిజానికి శ్రీ నందా రాజీనామాకు దారితీసింది నవంబరు 7వ తేదీన జరిగిన సంఘటనలు కాదని, ఆయన్ని ఏదో సాకుతో కేంద్రంనుంచి తప్పించాలని కొంతకాలంగా కొందరు కాంగ్రెసు పెత్తందార్లు ప్రయత్నిస్తున్నారని, ఆయన హోం మంత్రిగా వుండడం వారి విశృంఖల విహారానికి అడ్డంకిగా వున్నదని, అందుచేత గోవధనిషేధోద్యమాన్ని సాకుచేసుకుని ఆయన రాజీనామా ఇచ్చేట్టు వారు వొత్తిడి తెచ్చారని కొందరు ప్రతిపక్షాలవారు ఆరోపించారు. ఆ మాటనే శ్రీ నందా కూడా స్వయంగా తన రాజీనామా లేఖలో అంతకు ముందే ఉటంకించారు కూడా. మరి ఇందులో ఎంతవరకు నిజమో, ఎంతవరకు కల్పితమో తెలుసుకోవడం కష్టం.

ఏమైనా, ఎన్నికలు సమీపిస్తున్న సమయంలో ఇందిరా గాంధి ప్రభుత్వానికి, ఆమె పార్టీకి అన్నీ గొడవలుగానే తయారయ్యాయి. ముందు ముందు ఇవి ఇంకా హెచ్చుతాయేగాని తగ్గేట్టు లేవు.

***

# మా తృ శ్రీ

వచ్చినవారు "దేశ ద్రిమ్మరులం. అలుసొచ్చి, అల్లంతలో ఆలయం చూసి, రవ్వంత చోటుకై వచ్చా"మని మనవి చేస్తే, లేచి ప్రతినమస్కృతులిడి, సాదరంగా ఆహ్వానించి, సరసన కూర్చుండవిచ్చి సహపంక్తికి మరో ఇద్దరికి కబురంపించి, అంతాకా ఏంచేస్తాం? మీకు తెలిసిన విశేషం వివరించి మనగా, వచ్చినవాడు "తామెంత - తమ రెరిగిన దెంత" అని ప్రశ్నించి వాడకట్టు విశేషం తెలియ జెప్పమన్నారు. అనగా—....అరనిమిషం అనంతరం మొదలిడినారు :

ఈ ఊరు అప్పటికి చిన్న పల్లె — ఓ వంద గడప ఉండేదేమో — అందులో మూడు పాతికలు మా కులంవారివి. మిగిలిన వాటిలో ఒకటి తప్ప ఇతరులవి. ఆ మిగిలిన ఒక్క గడప ముంగిట్లో....

రాకేందువదనే - చిరునవ్వు మోముతో - కాళ్ళకు గజ్జెలు, కదిలితే ఘల్లుమనేటట్లుగా - అలవోకగా చేయి గడప కానించి - వాలి వయ్యారంగా ఆ దారినే పోతున్న వార్ని - అడ్డబొట్టువార్ని-ఎర్రని పట్టు పంచెపై పెద్దాపురం సిల్కు కండువాతో-మందు మూలికలకై పోతున్నవార్ని, మా తాతగార్ని చూచింది.

రా రమ్మని పిలిచింది. కనుగవతో సైగ చేసింది. కేలందించి పాదాలు ముద్దిడుకుంది.

"వరహా ల్లేవే" అన్నారు వారు.

"సామీ, ఆడుతూ పాడుతూ అంతో ఇంతో వెనకేశాను. మా లోగిట్లో వరహాల చెట్లు విరబూస్తున్నాయ్. కావాలంటే కోసిచ్చేందుకు నే నున్నా. కాని ఆ మల్లికార్జునునకు నాపై దయ ఏల లేదో - నన్ను కన్నవారికి నేనే అపచారం చేశానో - గూటికో దివ్వె - చెట్టుకో కాయ - వెన్నుకో గింజ - మా ఇల్లు వెల్లివిరిసే ఆ వెలుగు లేకుండా పోయింది. కరుణ చూపి - వరహాలేలనయ్యా-ఆ వరాన్నిచ్చిపో -"

అని కేల్మోడ్చిందయ్యా. తాతగారు కరిగిపోయారు. కంటినీరు కండువాతో అద్దుకొని - "ఈ పూటకు నన్నొదిలెయ్ - మాపటికి మరలివచ్చేనులే" అని సెలవిచ్చినవారై సాగిపోయారు.

* * *

వెన్నెలరేడు వెల్లివిరుస్తోంటే-చల్లని పిల్లగాలులు వీస్తుంటే, రాకేందువదనకు రాత్రి పది యుగాలపెట్టే అయింది. పడమటికొండ వెనక్కు సూరీడు జారగానే - కిలకిల నవ్వుతుంది. గలగలా మాట్లాడుతుంది. గజ్జెలు ఘల్లనగా గంతు

---

మొదటి బహుమతి రూ. 50/-

కిళాంబి శాంతారాం
ఎమ్. ఎ. (ప్రీవియస్)
ఆంధ్ర యూనివర్శిటీ,
వాల్తేరు.

చేస్తుంది. ఆ పైన మల్లెల మాలలు తీసుకొని — మల్లెపూరేకు లాంటి వసనం కట్టి — పాలతెలుపు జిలుగు కంచుకం తొడిగి మెడలో ముత్యాల సరముతో — తలకి పాపిడ శేరుతో — చెవులకు ముత్యాల లోలకులతో — అప్సరసే అయింది. కాలం గడచినకొద్దీ రావలసినవారు రాకపోగా, 'ఏల రాలేదయ్యా' అంది. 'నా మొర నిలువలేదేలనయ్యా?!' అని వాపోయింది.

అక్కడ తాతగారు. మామ్మతో — "మనసైన పిల్ల పిలిపించే — చేయూతనిచ్చి కాపాడుతున్నావా?" అని — "వేళ మించబడి పసిపి విలవిలలాడుతూ ఉంటుంది, పని లేదు మనకయితే మనసొప్పటం లేదు. చేతకాక కాదనుకో. అంటూ "అరె! పిచ్చితల్లి — ఈ కోర్కె కొన్నాళ్ళ ముందే కోరకపోయావా ఈ నాటికో కొరికి వచ్చే" దని వాపోతూ...."ఆ చేతిలో నీళ్ళు ఈ చేతిలోకి ఏనాడు పడ్డాయో నువ్వే నేనయ్యాను ఆనాటినుంచి పరమాత్మ దంతటి వాణ్ణి కాకపోయినా — ఈ విషయంలో రాముడే నా ఆదర్శమనుకున్నానే. ఇంత బ్రతుకు బ్రతికి చివరికి ఈ వయసులో, ఛ, ఛ, కథలు చెప్పవలసిన ఈడుకాని కథనడిపే ఈడు కాదు! కాదు కూడదని వెడితే — రేపు మనవాడికి తెలిసి 'నాన్నా, మొన్నా రీతి నేల చేసేవయ్యా' అంటే ఏం సాకు చెప్పనే" అంటూంటే ...

"చాల్చాల్లెండి, నాతో పిల్లది అమ్మా! బొమ్మ కావాలంటే ఇప్పించనా — అయినా ప్రతి విషయానికీ మీరింతే, అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడు—దానిరాత బావుంటే యశోదాపుత్రుడే పుడతాడేమో. అంటే అమ్మ కడుపున కాయ అవుతుందేమో. మనం నిమిత్తమాత్రులం—"అంటూండంగా .... తాతగారు చివాలున లేచారు - పెరట్లో స్నానం చేసి - పూజగదిలో "అమ్మా - ఆ రూపంలో మా ఆవిడ మాటల్లో నీవలా సెలవు చేశావు - నీమాట నేకాదంటానా! పసిది పల్లెత్తదు నాకు తెలుసు" అని పట్టుబట్టతో - అమ్మ బొమ్మందుకొని - కండువా చాటున ఉంచుకొని వడివడిగా రాకేందువదన లోగిలికి సాగిపోయారు.

"పిల్లా - పెరట్లో వళ్ళు తడుపుకొని - తడిబట్టతో ఎదుట పద్మాసనం వేయవే" అన్నారు. రాగానే నొసట బొట్టుపెట్టి తాను నడుముకు గుడ్డచుట్టి - మంత్రం ఉపదేశించి అంబను అందించి - "ఈదేవే నీ బిడ్డనుకో - దేవి సంస్మరణలో సర్వం మరచిపో - కంటికి రెప్పలా కాచుకో - కన్నులపండువయేలామందికం కట్టించి - సాకుకోవే. నీకు ముక్తి వచ్చేనులే" - అన్నారు.

రాకేందువదన రాయే అయింది. ఆశ్చర్యపోతూ - వణికే చేతులతో అందుకొని - ప్రక్కన ఉంచింది. తాతగారు - ఆశీర్వదించి - వెనక్కు కదిలిపోయారు.

ఆ తర్వాత ఈ ఆలయం వెలసింది. అంబను ప్రతిష్ఠించి, పేదలకు అన్నదానాలు చేసింది. రాకేందువదన నరుడికీ నారాయణుడికి తల్లే అయింది.

***

# మల్లె మొక్క

ఆ రోజు రైలులో జరిగిన సంఘటన గుర్తుకొస్తే ఇప్పటికీ నవ్వు ముంచుకొస్తుంది. తెలుసుకోవాలని కుతూహలంగా వుందా ? చదవండి మరి !

ఆ రోజు ఏదో పనిమీద మా వూరికి కొద్దిదూరంలోనే వున్న వూరికి బయలుదేరాను. నేను రైలుఎక్కిన కొద్దిసేపటి లోనే, అదే కంపార్టుమెంటులోకి ఒకతను ఎక్కాడు. చిన్న గోతంలో వున్న ముచ్చట గొలిపే చిన్న మల్లెమొక్కతో సహా ! మొక్క చిన్నదయినా రెండు మూడు చిన్న మొగ్గలతో చూడటానికి యింపుగా వుంది. రైలు బయలుదేరిన కొద్దిసేపటికే ఈ క్రింది సంభాషణ వినిపించింది ఆ కంపార్టుమెంటులో.

"ఈ మల్లెమొక్క ఎవరిదండీ ?" టికెట్ కలెక్టర్ ప్రశ్నిస్తున్నాడు. తన మల్లెమొక్క చూచి మురిసిపోయి మెచ్చుకుంటున్నాడనుకొని, "ఈ మొక్క నాదేనండీ ! విశాఖ పట్టణంలో కొన్నాను. ఇంతకు ముందు ఎన్నిసార్లు వేసినా మా పెరట్లో బ్రతకడం లేదు. ఈసారి అయినా బ్రతుకుతుందనే ఆశతో తెస్తున్నాను. ఈ మొక్క చూస్తే అటువంటి ఆశ కలుగుతోందండి" అంటూ ఏకరువు పెట్టాడు. అతను అంతా విని "అయితే ఈ మొక్క మీదాండీ! దీనికి ఛార్జీ చెల్లించారా ?" అని ప్రశ్నించాడు. అతను ఆశ్చర్యపోతూ "అదేమిటండీ ! ఈ చిన్న మొక్కకి ఛార్జీయా ?" అన్నాడు.

"అయితే కట్టలేదన్నమాట. మొక్కలకి ఛార్జీలేకుండా తీసుకు వెళ్ళటం రైల్వే రూల్సుకి విరుద్ధం. అయినా ఇపుడు మించిపోయిందేమీ లేదు. నా ద్వారా చెల్లించండి, రశీదిస్తాను" అన్నాడు టికెట్ కలెక్టర్.

"ఇంతకు ముందెన్నిసార్లో తీసుకు వెళ్ళాను. ఇటువంటి మాటలు వినలేదు. అయినా ఇంత చిన్న మొక్కకి ఛార్జీ ఏమిటి చెప్పండి" అన్నాడు అతను ప్రక్కనున్న ఇంకొక ఆసామితో.

"ఏమో ? నాకేం తెలుసండీ ? ఆయనేమో రైల్వే రూల్సు అంటున్నారు. దానికి విరుద్ధంగా నేనేమి చెప్పగలను" అంటూ తప్పుకొన్నాడు ప్రక్కనున్న ఆ ఆసామి.

---

రెండవ బహుమతి రూ. 25/-

ఎమ్. బి. లక్ష్మి

బి. ఎస్‌సి. (మూడవ సంవత్సరం)
సెంట్ జోసెఫ్స్ స్త్రీల కళాశాల.
విశాఖపట్టణం

అతను ఆ ఆసామి వైపు చుర చుర చూసి ముఖం త్రిప్పుకొని కిటికీగుండా బయటకు చూస్తూ కూర్చున్నాడు.

టికెట్ కలెక్టర్ అతని ఎదటి సీట్లో బైఠాయించి ఛార్జీ కట్టమని మళ్ళీ అడిగాడు.

"కట్టను గాక కట్టను" అన్నాడతను ముఖమైనా త్రిప్పకుండా. ఏమి జరుగుతుందా అని చోద్యం చూస్తూ కూర్చున్నారు కంపార్టుమెంటులోని వారు.

టికెట్ కలెక్టర్ ఛార్జీ కట్టమని సతాయిస్తున్నాడు. అతను వినిపించుకోకుండా కూర్చున్నాడు.

కొంత సేపయింది అతను టికెట్ కలెక్టర్ మాటలు భరించలేక పోయినట్లున్నాడు. "ఇంతకి మీ రనేదేమిటి?" అన్నాడు కటువుగా.

"ఛార్జీ చెల్లించమంటున్నాను." మొదటి పాట తిరిగి వినిపించ చేశాడు టికెట్ కలెక్టర్.

"అయితేసరే!" అంటూ దురుసుగా మొక్కాని తీసి నడుస్తున్న బండిలోంచి బయటకు విసిరి కొట్టాడు. అందరూ నిర్ఘాంత పోయారు అతని సాహసానికి.

కొంతసేపటికి టికెట్ కలెక్టర్ "అదేమయ్యా! అలా విసిరేశావ్!" అన్నాడు ఆశ్చర్యంలోంచి తేరుకుంటూ "నీ పీడ వదలించుకోటానికి" విసురుగా వచ్చింది జవాబు.

"అయితే నా కిచ్చెయ్యలేక పోయావయ్యా" తన కక్కుర్తిని బయటపెట్టాడు టికెట్ కలెక్టర్.

"అలా అని మొదటే అఘోరించలేక పోయావ్?"

అంతే! కంపార్టుమెంటులో అందరూ గొల్లున నవ్వారు. టికెట్ కలెక్టర్ ముఖం చూడాలి ఆ సమయంలో!

***



# అర్ధ మొగుడు

సాయంత్రం ఆరు గంటల వేళ అనూరాధ హాల్లో పడక్కుర్చీలో పడుకున్నట్లు కూచుని "జ్యోతి" చదువుతోంది.

గేటు తీసిన చప్పుడు. ఎవరో వస్తున్న చప్పుడు చెవులకు సోకింది విసుగ్గా తలెత్తి చూసింది. చటుక్కున లేచి నిలబడింది. వెంటనే బయటికి వచ్చింది.

ఒకమ్మాయి! తన ఈడుదే! తన కన్నా తెల్లగా ఉంది. గుండ్రని ముఖం, నవ్వే కళ్ళు!

"ఎవరు?" అని అడగా లనుకున్న అనూరాధ "రండి" అన్నది. "ఇదేమిటి, ఇలా అన్నాను?" అని ఆశ్చర్య పోయింది కూడా.

ఆ అమ్మాయి లోపలి కొచ్చింది.

"కూర్చోండి!" అంది అనూరాధ.

ఏం మాట్లాడాలి? ఎవరో తెలీదు. జీవితం ఎప్పుడన్నా చూసినట్టుగూడా లేదు. అయినా, ఇందాకే అడగవలసింది. ఖర్మ! చూడబోతే అల్లరి పిల్లలాగా ఉంది. "ఎవరు?" అనడిగితే, "ఇప్పు డడుగుతున్నారా?" అంటే? తనకే సిగ్గు. అనే రకమే!

"ఒక్కసారిలా ఇవ్వండి ఆ జ్యోతి" అందామ్మాయి. ఇచ్చింది.

"మీరు బి. ఏ. చదువుతున్నారు కదూ?" సూటిగా చూస్తూ అడిగిందామ్మాయి.

ఒక్కసారి చుట్టూ చూసింది అనూరాధ.

డ్రాయరుమీదనుంచి 'ఫార్ ఫ్రమ్ ది మాడింగ్ క్రౌడ్' తొంగి చూస్తోంది. అయినా, చూద్దాం అని —

"మీకెలా తెలుసు!" అడిగింది.

"నాకు తెలుసు" అందామ్మాయి.

"ఏం? చదువుతున్నాననే ఎందుకనుకోవాలి? అయిపోయిందనుకో వచ్చుగా!"

"ఇలా చూడండి! అదుగో, మీ ఇంగ్లీషు నాన్డీటెయిల్డు పెట్టు. అది సెకండ్ ఇయర్ ది. కాబట్టి మీరిప్పుడు చదువుతున్నారు" ఘంటాపథంగా అన్నట్టు చూసింది.

"ఏం? నేను కంప్లీటు చేసి ఉండొచ్చుగా బి. ఏ.?"

"అయితే, ఆ పుస్తకం అక్కడ ఉండదు."

"ఎందుకలా అనుకున్నారు?" ఆశ్చర్యంగా అడిగింది.

---

రెండవ బహుమతి రూ. 25/-

కుమారి పి. శ్రీకళ
బి. ఏ. మొదటి సంవత్సరం,
ఉమెన్స్ కాలేజి, గుంటూరు.

ఒక్కసారి వింతగా చూసి ఇలా అందామ్మాయి : "కంప్లీటు చేసినప్పుడు ఇంక క్లాస్ పుస్తకాలు మళ్ళీ పట్టుకునే వాళ్ళు ఎంతోమంది ఉండరు. ఒకవేళ ఉన్నా, ఆసక్తి ఉండి అనుకునేవాళ్ళయితే ఆ పుస్తకం అలా, ఆ రకంగా ఉండదు."

అనూరాధ ఒక్కసారి తన అట్ట చిరిగిపోయిన పుస్తకాన్ని చూసి సిగ్గుపడింది. ఆ అమ్మాయి వాక్చాతుర్యానికి ఆశ్చర్యపోయింది.

"ఏం! కోపం వచ్చిందా ?"

"లేదు."

"అదేమిటో - అనుకున్న మాట వెంటనే చెప్పడం నా కలవాటు."

"అదే నా కిష్టం."

"ఇంతకీ నేను చెప్పింది కరక్టేనా "

"నూటికి నూరు పాళ్లా కరెక్ట్. నేను బి. ఏ. సెకండియర్ చదువుతున్నాను."

కాసేపాగి—

"అవునూ - నేను బి. ఏ. అనే ఎందు కనుకున్నారు?" ప్రశ్న అనూరాధది.

"మీరు తీరిగ్గా జ్యోతి చదువుతున్నారు గనుక." నవ్విందామ్మాయి. మళ్ళీ విశ్శబ్దం.

"మీరు బి. ఎస్సి. అనుకుంటాను" అడిగింది అనూరాధ.

ఈసారి ఆశ్చర్యం ఆ అమ్మాయిది.

"అహాఁ, ఏంలేదు మీరలా అన్నప్పుడు మీ ముఖంలోని భావాలవలన కనుక్కున్నాను" అన్నది. అనూరాధ కళ్ళల్లో హాస్యరేఖ తొంగి చూస్తుండగా.

"మీరు ఛలేవారేనే!" అంది ఆ అమ్మాయి.

"ఉండండి. ఇప్పుడే వస్తా" లోపలి కెళ్ళింది అనూరాధ.

కాసేపట్లో కాఫీ కప్పులతో ప్రత్యక్షమయింది.

"ఏమిటండోయ్, ఇప్పుడీ మర్యాద లన్నీ!" అందామ్మాయి.

"ఫరవాలేదు. కాఫీయేగా!"

"నాకు ఉత్త కాఫీ తాగే అలవాటు లేదే!" కొంటెతనం కళ్ళల్లో.

"అయితే, క్షణంఉంటారా? ఉప్మా చేసి తెస్తాను "

"అమ్మో! క్షణమే? అయినా, నాకు ఉప్మా సయించదు."

"అయితే, కాఫీ ఒక్కటే తాగండి. అదే మీకు శిక్ష!" కూచుంటూ అంది.

"అన్యాయం! ఇదేం మర్యాదండీ! ఉప్మా సయించదంటే ఇంకేమన్నా చేసి పట్రావాలిగానీ!"

"త్వరగా అయ్యేది అదే! మిగతావి చెయ్యడమంటే తలనొప్పి నాకు. గంటలకొద్దీ కూచోవాలి పొయ్యిదగ్గిర."

"అయితే, మనిద్దరి పాలసీ ఒకటే

వన్నమాట! నాకూ తలనొప్పి ఈ వంటా వార్పూ అంటే!"

"అవును. బోరు! పొయ్యి దగ్గర కూచోడం."

"అవును. నాకూ బోరే! కానీ, మా అమ్మ వినదు. నాచేతే చేయిస్తుంది."

కాఫీలు పూర్తయ్యాయి. కప్పులు ఆ పక్కనే పెట్టింది అనూరాధ-లోపల కూడా పెట్టకుండా.

"చాలా సేపయిందండీ వచ్చి" టైము చూసుకుంటూ అందామ్మాయి.

"ఇంక వస్తాను! మీ ఆదరణకి చాలా థాంక్స్. ఇప్పుడు బస్సు వస్తుంది కదూ!" నడుస్తూనే మాట్లాడుతోంది.

"అప్పుడప్పుడూ వస్తూ ఉండండి. ఈ కాసేపట్లోనే మీరు నా ప్రాణ మిత్రురా లయినారు. అదేమిటో!" వెంట వెళ్తూ అంది అనూరాధ.

"అలాగే. నాకూ అలాగే ఉంది. ఫరవాలేదు. ఎలాగూ మళ్ళీ కలుస్తాంగా గుడ్ నైట్!"

"గుడ్ నైట్." వెళ్ళిపోయింది.

* * *

"ఎవరే వచ్చిందీ?"

అమ్మ అడిగింది వస్తూ గుడినుంచి.

"అరే! పేరే అడగలేదే? తన మతి



మరుపుకి తనకే నవ్వొచ్చింది. గంట సేపు మాట్లాడారు కదా! ఎవరోకూడా తెల్సుకోలా తను. కనీసం ఇంతకీ తనెవరో తెలుసా ఆ అమ్మాయికి? తెలీకపోతే ఎందుకొస్తుంది ఇక్కడికి? అసలు ఎందుకొచ్చింది? ఏం పని తనతో? కనీసం తన పేరన్నా తెలిసినట్టు లేదు. ఎలా వచ్చింది?

"ఎవరే అంటే మాట్లాడవేం?"

తల్లి మళ్ళీ రెట్టించేప్పటికి ఈ లోకంలోకి వచ్చి 'ఏమో!' అంది. 'సరేలే!' నవ్వుకుంటూ వెళ్ళింది తల్లి లోపలికి.

★ ★ ★

నెలరోజులు గడిచాయి. ఆ సంఘటనే మర్చిపోయింది అనూరాధ. ఆ రోజు వచ్చింది నాన్నకి ఉత్తరం. అంతకి రెండు నెలల్క్రితమే చూచి, ఉత్తరం రాస్తామని వెళ్ళిన పెళ్ళివారి దగ్గిర్నించి! అదీ సంతోష వార్తతో "పిల్లనచ్చింది, ముహూర్తం పెట్టించ" మని! ఇంట్లోవాళ్ళ ఆనందానికీ — హడావిడికీ అంతులేదు.

పెద్ద ఇంటివారు, ఆస్తి కలవారు. అబ్బాయి చదువుకున్నవాడు, అందగాడు! ఇంకేం కావాలి?

ముహూర్తం నిశ్చయించేశారు. పదిహేను రోజులుంది పెళ్ళి ఇంక.

ఆ రోజు అనూరాధకి ఉత్తరం వచ్చింది. రాత చూస్తే క్రొత్తగా వుంది. ఎవరు రాశారు? ఎవరై ఉంటారు! ఆలోచిస్తూ కవరుచించింది. ఒకఫొటో! ఆ అమ్మాయి!! గంటసేపు పేరేమిటో గూడా తెల్సుకోకుండా మాట్లాడిన, మాట్లాడుకున్న స్నేహితురాలు! ఒకేసారి ఆనందం, కుతూహలం కలిగాయి! అలా చూస్తూ ఉండిపోయింది చాలాసేపు. నవ్వే కళ్ళు! గుండ్రని మొహం! ఎంతసేపో చూసింతరువాత ఫొటో కవర్లో పెట్టబోయి అందులో ఉన్న ఉత్తరాన్ని అదే ఒక కాయితాన్ని అప్పుడే చూసి తీసి చదివింది!

"అనూరాధాదేవీ,

నేనే? నాపేరూ.... ఏమనుకుంటున్నావు! నేనెవరో నీకు తెల్సుకానీ అడ్రసూ, ఊరూ! ఊహూఁ! అదే సస్పెన్సు!! నాపేరు మధురిమ. నీ మేరేజికి నేను తయారు.

విష్ యు గుడ్ లక్,

ఇట్లు,
అర్ధ మొగుడు.

(అంటే - అర్ధం తెలుసుకదూ?)"

కళ్ళు పెద్దవి చేసి చూస్తూ ఉండిపోయింది అనూరాధ.

★★




ఉన్నట్టుండి సుబ్బరామయ్యకు తాసిల్దారు గారితో పనిబడింది. మరొకరూ, మరొకరూ అయితే చిటికెలో సాధించుక రాగలిగిన పని. కానీ సుబ్బరామయ్య పాలిటి కది కొండల్ని త్రవ్వడమంత కష్టసాధ్యంగా కనిపించింది.

ఉద్యోగుల ముఖం చూడరాదన్నది; కాకపోతే వాళ్ళ ముఖాన పడరాదన్నది సుబ్బరామయ్య ఆదర్శం. వార్తాపత్రిక చూడకుండా వుండడం సాధ్యంగావచ్చు. సినిమాకు వెళ్ళకుండావుండడం సాధ్యంగావచ్చు. వానలో తడవకుండా సాధ్యంగావచ్చు. కానీ, ఈనాటి మానవుడు ఏ రంగంలో జీవిస్తున్నా. ఉద్యోగులతో జోక్యం పెట్టుకోకుండా జీవించడం దుస్తరం! కానీ, సుబ్బరామయ్య విషయం వేరు. ఆరు నూరైనా, నూరు ఆరైనా అతడు తన ఆదర్శంనుంచి ఏనాడూ తప్పటడుగు వేయలేదు.

ఇక్కడెవరికైనా ఉద్యోగుల పట్ల సుబ్బరామయ్య కలాంటి అభిప్రాయం కలగడానికి కారణ మేమైవుంటుందన్న జిజ్ఞాస కలగడం సహజమే! పూర్వగాధ లేకపోలేదు. సుబ్బరామయ్య ఉద్యోగులని గొప్పగా చెప్పుకోదగిన వారెవరూ లేని పల్లెలో పుట్టి పెరిగాడు. గ్రామంలో వున్న మునసబు, కరణము గ్రామ పౌరులుగానే తప్ప, ఉద్యోగులుగా పరిగణింపబడేవారుకారు. ఆ ఊరి పేరు కంకి మిట్ట. గ్రామ కరణం పేరు

శరభయ్య. అతడు సుబ్బరామయ్య తండ్రికి వేలువిడిచిన పెదతండ్రి కొడుకు. అందువల్ల సుబ్బరామయ్యకు పెద తండ్రి వరుస. పాపం, అతగాడికి పిల్లలు లేరు. తనకు పిల్లలు లేకపోతే గానీ, ఎదుటివారి బిడ్డలను ప్రేమతో దగ్గరికి చేరనీయరాదన్న సిద్ధాంతం మనుస్మృతిలో వుందో, లేదో తెలియదు. ఆ సిద్ధాంతానికి అనుగుణ్యంగా శరభయ్య సుబ్బరామయ్యను దగ్గరకు చేరదీసి ముద్దుగా చూచుకుంటూ మురిపాలు ఒలకబోసేవాడు. ముద్దు మురిపాలతో బాటుగా అతడు తన సుగుణ సంపత్తినిగూడా కొంతలో కొంత సుబ్బరామయ్యకు సంక్రమింపజేశాడు.

పేరుకు శరభయ్యేగానీ కంకిమిట్ట కరణం ధాటీగా నీళ్ళయినా మ్రింగడం చేతకాని సాధువు. రివిన్యూ యిన్స్పెక్టరు గ్రామంలోకి రాబోతున్నాడంటే, ఆ ప్రాంతంలో రాజాధి రాజొకడు మజిలీ వేయబోతున్నాడన్నంతగా అతడు బెంబేలు పడిపోయేవాడు. కూర్చున్నచోట కూర్చునేవాడు గాడు. నిల్చున్నచోట నిల్చునేవాడు కాడు. రివిన్యూ యిన్స్పెక్టరుగారు రాబోతున్నారని చెప్పుకుంటూ గ్రామమంతా చెడ తిరిగేసేవాడు. రాబోతున్న ఉద్యోగి శాకాహారి అయితే అందుకొక రకమైన ఏర్పాటు. సర్వభక్షకు డైతే అందుకొక విధమైన సన్నాహం. రోడ్డులో బస్సు దిగితే, అక్కడినుంచి పట్టుమని నాలుగు ఫర్లాంగులు లేకపోయినా, ఆ మాత్రం నడచి రావటానికైనా ఉద్యోగి గారి సుతిమెత్తని ప్రాణం ఒప్పుకోక పోవచ్చునని అందుకోసం ఒక ఒంటెద్దు బండి తయారింపు. అతడు వచ్చి బండి దిగేసరికి, లోపలికి వెళ్ళి పాతకోటు తగిలించుకుని, తలపాగా సర్దుకుంటూ బయటికి పరతెంచి వచ్చేతీరు. ఆపాటికే చంకల్లో పొన్నుకర్ర అమరగా, నడుమూదాకా వంగబెట్టి, ముకుళిత హస్తుల్నిగా చేసి తోటి, తలారి వారిని ముందువెనుకలుగా నిల్చోబెట్టిన పద్ధతి — చిన్ననాడు యిలాంటి దృశ్యాలను తరచుగా చూడడానికి అలవాటు పడ్డాడు సుబ్బరామయ్య.

రివిన్యూ యిన్స్పెక్టరుగారు వెళ్ళిపోయిన తర్వాత, నిండుగా వూపిరి వదిలి అరుగుపైన చతికిలపడిపోయేవాడు శరభయ్య. సుబ్బరామయ్య మెల్లగా అతని దరసకు చేరేవాడు. సదుపదేశాలప్పుడే ప్రారంభ మయ్యేది.

"అదికాదు పెదనాన్నా! రివిన్యూ యిన్స్పెక్టరంటే ఎందుకంత భయం? అతడిచేత తుపాకీ అయినా లేదే! అతడు కనీసం ఎర్రటోపీ అయినా వేసుకోలేదే."

బుల్లివాడి అమాయకత్వానికి శరభయ్య పకాలున నవ్వేసేవాడు. "ఒరేయ్ కుర్రకుంకా! నాకు తెలుసుం. నువ్వు చెపుతున్నది పోలీసును గురించి. రివెన్యూ యిన్స్పెక్టరు పోలీసెందుకౌతాడు? ఆయన మరికొంత కాలానికి తాశీల్దారవుతాడు. తాశీల్దారంటే ఏమిటో తెలుసా? తాలూకా కంతా పెద్ద. మనెక్కడ చూశావుగానీ కోటకొమ్మాల (తాలూకా కేంద్రం) లో తాలూకాఫీసుంది. ఎర్రటి ఇటుకరాళ్ళతో కోట లాంటి కట్టడం. ఇనుప కమ్ముల దర్వాజా లుంటాయి దానికి! నువ్వింం

దాకా చెప్పావే. ఆ పోలీసువాళ్ళు ఆ తలుపుల దగ్గర కాపలా వుంటారు...."

"పోలీసులు కాపలా కాయడమెందుకు నాన్నా?"

"అది తాశీల్దారుగా రుండే చోటు గదూ! అందుకని...."

"పోలీసులు లేకపోతే, తాశీల్దారుగారు ఒంటరిగా వుండలేడా పెదనాన్నా?"

"ఛా ఛా! ఆయనకేం భయంరా సుబ్బులూ! తాలూకా అంతటా వసూలైనకిస్తీ డబ్బులు అక్కడే వుంటాయి గదూ! ఆ ఖజానాకు పోలీసులు కాపలా కాస్తారన్నమాట!"

"ఓయబ్బో! అలాగైతే తాశీల్దారుగారి దగ్గర లెక్కలేనంత డబ్బుంటుందన్నమాట!"

"ఉంటుందిగానీ, ఆ డబ్బు ఆయనది గాదురా సుబ్బులూ! గవర్నమెంటుది...."

"గవర్నమెంటా? వాడెవడు పెదనాన్నా? తాశీల్దారుకంటే గొప్పవాడా ఏమిటి?"

ఇలాంటి చొప్పదంటు సందేహాల వల్ల గవర్నమెంటుయొక్క ఘనతకేదో అపచారం జరిగిపోయినట్టుగా నొచ్చుకునేవాడు శరభయ్య - "గవర్నమెంటంటే మనిషి కాదురా సుబ్బులూ! అదొక సంస్థ. తెలుగులో ప్రభుత్వం అనడం దాన్నే! తాలూకా కొక తాశీల్దారుంటాడా! అలాంటి తాశీల్దారులు పదిపన్నెండుగురికి పైన కలెక్టరుంటాడు. జిల్లాలో అతడి అధికారానికి తిరుగుండదు. ఎంత కొమ్ములు తిరిగిన తాశీల్దారయినా సరే, కలెక్టరుగారి ఎదుట గడగడలాడి పోవలసిందే! అంతెందుకు? గవర్నమెంటొక కొండలాంటి దనుకో! అందులో నేను - అంటే గ్రామ కరణాన్ని - ఒక చిన్న గులకరాయిలాంటి వాణ్ణి. రివిన్యూ యిన్స్పెక్టరొక గుండ్రాయిలాంటి వాడనుకో. అప్పుడు తాశీల్దారు ఒక రుబ్బురాయంతటి వాడు. రెండు చేతులతోనూ అప్పళించుకోడానికి వీల్లేని పెద్ద గుండుంది చూచావూ, కలెక్టరు నంతటి వాడనుకోవచ్చు...."

"మరైతే కొండల్లో అంతకంటే పెద్ద గుండ్లుండవా పెదనాన్నా?"

"ఎందుకుండవు. వాళ్ళే గవర్నర్లు. మనం దేవుళ్ళనేనాడైనా చూచామట్రా సుబ్బులూ? నే నొకసారి గవర్నరు దొరగారిని చూచాను. రాజ్యమేలడానికి పుట్టినవాళ్ళు అలా వుంటారేమో! అబ్బ, ఏం మీసాలు! ఏం ఠీవి! కారులోనుంచి దిగి హుందాగా చేతులూపుకుంటూ, అలా అలా మందగమనంతో వచ్చి బంగళాముందు నిల్చున్నాడు. నిలువెత్తు భారీ మనిషి. ఆయనొక వూడల మర్రిలా వున్నాడనుకో! ఆయన ఎదుట కలెక్టర్లు కానుగ చెట్లు.

తాశీల్దారులు తమ్ముచెట్లు. రి వి న్యూ యిన్స్పెక్టరులు గరికపోచలు. మరి మాలాంటివాళ్ళ దేముంది? మేము లెక్కలోనివాళ్ళం కాము...."

"అలాగైతే ఈ రాజ్యమంతా గవర్నరుదేనా పెదనాన్నా?"

"అబ్బే, అతడు గూడా ఉద్యోగస్తుడే! అలాంటి గవర్నరులందరూ వైస్రాయికి సలాములు చేయాలి మరి! చెప్పుకోవడమేగానీ వైస్రాయిని ఎవరు చూచారురా సుబ్బులూ! ఎక్కడో ఢిల్లీలో వుంటాడుట! ఢిల్లీ, ఢిల్లీ అన డమేగానీ అదెల్లా వుందో ఏమిటో! రైల్లో వెళ్ళిరావాలంటే టిక్కెట్టుకే వంద రూపాయలు కావాలిట!"

"ఆ వైస్రాయి ఇంకొకరికి భయ పడాల్సిన అవసరం వుండదా పెద నాన్నా?"

"ఎందుకుండదు! వైస్రాయి రాజు గారికి జవాబు చెప్పుకోవాలిగదా! తెలియ దట్రాసుబ్బులూ! మనదేశానికి రాజు ఇంగ్లాండులో వుంటారు. మృగాల్లో సింహం రాజుగదూ! చుక్కల్లో చంద్రుడు రాజుగదూ! నరమానవులకు ఆయన అలాంటి రాజన్నమాట? అందరూ ఆయనకే భయపడాలి. ఆయన ఒకరికీ భయపడరు. అందరూ ఆయనకి జవాబుచెప్పుకోవాలి. ఆయన ఒకరికి జవాబు చెప్పరు...."

ఈ అధికారోపనిషత్తును శ్రద్ధగా విన్నందుకు ఫలితంగా సుబ్బరామయ్య లేతబుర్రలో ఒక తిరుగులేని అభి ప్రాయం నెలనాటుక పోయింది.

తాను బ్రతికితే ఆ మహారాజు లాగై నా బ్రతకాలి. (ఆయన ఒకరికి భయప డడు గనుక!) లేదా అసలు సివలు సుబ్బరామయ్య లాగైనా బ్రతకాలి. (తానొకరికి భయపడవలసిన అవసరం లేదుగనుక!) అంతేగానీ వెళ్ళి వెళ్ళి సాలీడుగూటిలో తగులుకున్న ఈగలా ఉద్యోగుల చట్రంలో యిరుక్కో గూడదు!

కానీ సుబ్బరామయ్య తండ్రికి మాత్రం తన కుమారుడు ఉద్యోగాలు చేసి, ఊళ్ళేలాలన్న కోరిక మిక్కు టంగావుండేది. మెట్రిక్కుదాకా చదువు కుంటే సబ్ యిన్స్పెక్టరు గావచ్చు. శిరస్తాదారుగావచ్చు. కలెక్టరాఫీసులో హెడ్డు గుమాస్తా గావచ్చు. దేవుడు దయదలిస్తే యింకా ఏమైనా కావచ్చు. ఈ ఆశతోనే అతడు సుబ్బరామయ్యను హైస్కూల్లో చేర్పించాడు. ఆనాటి కింకా హైస్కూళ్ళు తామరతంపరగా పల్లెలకు, పేటలకు దిగుమతి కాలేదు. దగ్గరలో వున్న హైస్కూలు జిల్లా ముఖ్య పట్టణంలో వుందే ది. సుబ్బరామయ్య ఆ హైస్కూల్లోనే చేరాడు. చేరాడేగానీఅతడు హైస్కూలు చదువును తీరామారాతుదముట్టించలేదు. మధ్యంతరంగా చదువుకు స్వస్తిచెప్పి, యింటికి తిరుగు ముఖం పట్టాడు.

పట్టణంలో గడపిన ఆ అయిదారేళ్ళ లోనూ, సుబ్బరామయ్యకు ఉద్యోగుల ప్రపంచాన్ని గురించి మరికొన్ని విష యాలు తెలిసొచ్చాయి.

బడిమామూలుగానే జరిగి పోయింది అంటే చెప్పటానికి అల వాటుపడిన అయ్యవారు పాఠాలు చెబు

ఊనే వుంటాను. చెప్పనివాళ్ళు చెప్పనే చెప్పరు. ఉన్న మంచి చెడ్డ అన్నిటి లోనూ, నిమ్మళంగా సాగిపోతున్న పాఠశాలలో సంవత్సరానికి కొకసారి ఎక్కడలేని సంచలనం బయలుదేరు తుంది. బూజు దులపడం, గోడలకు వెల్ల వేయడం, తాతల కాలంనాటి పాత పటాలను వెలుపలికి తీయడం, రంగు కాగితాలతో తోరణాలు కట్టడం, వారం రోజులపాటు ఒకటే సందడి! వెళ్ళి పడిన పాము, కుర్చీలో కునికి పోట్లు పడడం అనేక విధాయక కృత్యంగా అలవాటుపడిన మేష్టారు సైతం ఆ వారం రోజులపాటు నిలు చుని పాఠం చెబుతారు. ఆలస్యంగా తప్పితే బడికి రాని మేష్టారు పదిగంటలకు మునుపే కాంపౌండులో కాలు పెడతాడు! ఏమిటో మార్పు? బడి ఎల్లప్పుడూ ఇలాగే జరిగితే ఎంత బాగుండేది.

బడి ఎప్పుడూ యిలా జరగాలను కోడమే తప్పు! సంవత్సరానికి కొకసారి యిలాంటి చైతన్యం నీటి బుడగలా అంతలో పుట్టి, అంతలో చిట్లిపోవడమే ఒప్పు అంటూ తేల్చి చెప్పేవారు అను భవజ్ఞులు.

ఎందుకంటే___

పై అధికారి ఏడాది పొడుగునా బడిని తనిఖీ చేయడం లేదు!

కానీ బడి సక్రమంగా జరగడం పై అధికారి సంతృప్తి కోసమా? విద్యార్థుల అభివృద్ధి కోసమా?

విద్యార్థుల అభివృద్ధి! అబ్బో, ఉద్ధా రకుడు బయల్దేరాడు. బడి క్రమంగా జరిగితేమాత్రం విద్యార్థు లందరూ అభి వృద్ధిచెంది పోతారన్న నమ్మకమే ముంది?

ఏడాదికొకసారి యిలాంటి హంగామా జరిగితే పై అధికారికి సంతృప్తి కలుగుతుంది సంస్థ బ్రహ్మాం డంగా నిర్వహించబడుతోందన్న కితాబు లభిస్తుంది. ఆ కితాబునొక తక్కెడలోనూ, వెయ్యిమంది విద్యార్థుల అభివృద్ధి నొక తక్కెడ లోనూ వుంచి తూచకుంటే, త్రాసు నిస్సందేహంగా మొదటివైపుకే మొగ్గు తుంది!

తన అంతరంగంలో పై అధికారికి వందన సహస్రాలు సమర్పించుకునే వాడు సుబ్బరామయ్య.

"ఓయీ పై ఉద్యోగీ! భూగోళం ధర్మమన్న యిరుసు చుట్టూ తిరుగు తోందని చెబుతుండే వాళ్ళు పూర్వులు. ఇప్పుడా ధర్మం ఏమైందో తెలి యదు. ఇప్పుడీ భూవలయానికి యిరు సువి నువ్వు. నువ్వు చండశాసనుడివి. నువ్వొకడివి వున్నావు గనుకనే, ఈ పాఠశాలలు, ఈ ఆఫీసులు మొద లైనవి ఈ మాత్రంగానైనా పని చేస్తు న్నాయి? నువ్వూ నీపై ఉద్యోగికి భయ పడబట్టేగదా!"___అనుకునేవాడు సుబ్బ రామయ్య.

కొందరు క్రింది ఉద్యోగులు పై ఉ ద్యోగికి అంతగా భయపడరు. కేవలం కర్తవ్య నిష్ఠవల్లనే గట్టెక్కవచ్చు. నను కుంటారు. అలాంటి వాళ్ళను పై ఉ ద్యోగి నిర్దాక్షిణ్యంగా అట్టడుగుకను ముంచివేయ జూస్తాడు. మరికొందరు క్రింది ఉద్యోగస్తులు కర్తవ్యాన్ని

చోట నుంచి, కేవలం ధూప దీప నైవేద్యాల వల్లనే పై ఉద్యోగిని ప్రసన్నుణ్ణి చేసుకోజూస్తారు. జగన్నాటకంలో వీళ్ళ పాచిక పారకపోలేదు. మానవులందరూ సమానులనుకోడం కద్దు! ఈ సమానత్వం భగవంతుడు పుష్కలంగా ప్రసాదించిన గాలిని పీల్చుకోడం ఒకదానిలో తప్ప మరెందులోనూ కనిపించదు. పై వారికీ, క్రిందివాడికీ వున్న తేడా పై వాడినెంత తక్కువణ్ణిగానైనా చేస్తుంది. క్రిందివాడిని ఎంత పనికిమాలిన వాణ్ణిగానైనా చేయగలుగుతుంది.

కానీ, ఈ తేడా ఒకస్నే కాడలో నుంచి రెండురకాల పువ్వుల్ని పుట్టించగలదని మాత్రం సుబ్బరామయ్య ఆనాడూహించనైనా లేదు!

★ ★ ★

పులి కడుపున పులిపిల్లే పుట్టినట్టుగా, మేక కడుపున మేకపిల్లే పుట్టినట్టుగా సుబ్బరామయ్య కడుపున ముమ్మూర్తులా సుబ్బరామయ్య లాంటి కుమారుడే పుట్టాడు. ఆ అబ్బాయి బట్టకట్టి బడికి వెళ్ళనేర్చిన కాలానికి కంకిమిట్ట కొక క్రోసెడు దూరంలోనే హైస్కూలు వెలసింది. అందువల్ల చదువులకోసం యింటికి దూరం కావలసిన అవసరం లేకపోయింది. కుర్రవాడు గూడా బుద్ధిగా చదువుకున్నాడేమో, స్కూల్ ఫైనల్ దాకా రథాన్ని సాఫీగా లాక్కొచ్చేశాడు. అంతవరకు అక్షరాలా ఆ తండ్రికి తగ్గ కొడుకే ననిపించుకుంటూ, తండ్రి గీచిన గీటుపైనే సాగిపోతున్న ఆ కుర్రవాడి బుద్ధి స్కూలుఫైనల్ ప్యాసై, సర్టిఫికెట్టు చేతికి రాగానే తటాలున 90 డిగ్రీల కోణంతో వక్రించింది. అతగాడు కాపు ఉద్యోగం చేయవలసిందే, చేసి తీరవలసిందే నన్నాడు. రైతు కొడుకు రైతే కానవసరం లేదు. అతడు ఉద్యోగం చేయదలచుకుంటే ఈ సర్వస్వాతంత్ర ప్రజారాజ్యంలో అడగలిగినదేదీ లేనేలేదన్నాడు. అనడంతో ఎక్కడూ ముకున్నాడు? తనకు తానై స్వప్రయోజకత్వం వెలిగించి ఏవేవో ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకున్నాడు. అందులో ఒకచోటనుంచీ ప్రత్యుత్తరం గూడా రానేవచ్చింది. ఉన్న సర్టిఫికెట్లకన్నింటికీ నకళ్ళు తీయించి, స్థాయిలో తాశీల్దారుకు తగ్గని గెజిటడ్ ఆఫీసరు దగ్గర సంతకం చేయించి వారం రోజుల్లో చేరేటట్టుగా అప్లికేషను పంపుకుంటే దరఖాస్తుదారుడికి ఇంటర్వ్యూ తేదీ తెలుపబడుతుందని ఆ ప్రత్యుత్తరం నివేదించింది. లక్ష్మణుడు మూర్ఛ మునిగిన సమయంలో రావలసివచ్చిన సంజీవనిలా, ఇప్పుడు గెజిటడ్ ఆఫీసరుగారి సంతకం కావాలి! ఎక్కడ దొరుకుతుందది? ఎలా దొరుకుతుందది?

కోట కొమ్మలలో తాశీల్దారుగారి ఆచూకీని గురించి తెలియచెప్పడానికిప్పుడు శరభయ్యగారు సజీవులై లేరు.

"ఒరే సుబ్బి! నేనెన్నడూ ఆఫీసుల వెంట తిరగలేదు. నీ పాట్లేవో నువ్వే పడు. కావలిస్తే అయిదో, పదో యిస్తాను. తీసుకెళ్ళు...." అన్నాడు సుబ్బరామయ్య.

అబ్బాయికి ఉద్యోగమంటే యిష్ట

మేగాని. ఉద్యోగులంటే బెదరులేక పోలేదు. ఆ పని ససేమిరా తనవల్లకాదు పొమ్మన్నాడు. కుమారులకు ఉద్యోగాలు సంపాదించి పెట్టే ప్రయత్నంలో అక్కడక్కడా కొందరు తల్లి దండ్రులు, మునుపటికి రావణాసురుడు కైలాసాన్ని పెల్లగించినట్టుగా, ప్రభుత్వాన్నే కదిలించి వేస్తున్న ఉదంతాలను సోదాహరణంగా వివరించాడు

సుబ్బరామయ్యకు గత్యంతరం లేక పోయింది. అతడు తాశీల్దారుగారి కోసం బయలుదేరక తప్పలేదు.

సుబ్బరామయ్య తన జీవితం పొడుగునా మహదాశ్చర్యకరమైన సంఘటనల నెన్నింటినో చూశాడు. మూతలేని పెట్టె ఒకటి మాటల మూటగా, పాటల పేటికగా పనిచేయడం అతని కెనలేని విస్మయాన్ని కలిగించింది. తెరగుడ్డపైన బొమ్మలాడడం మాత్రమేగాదు, మాటాడడంగూడా అతడు విన్నాడు. కూతవేటు దూరమన్నది ఒక ఫర్లాంగు దూరంనుంచి, యోజనాలకు యోజనాలే అధిగమించడం అతడి జీవితకాలంలోనే జరిగింది. సుబ్బరామయ్యకు ఎంతగా ఆశ్చర్యం కలిగించినవాటిలో, కోటకొమ్మలయొక్క పెంపుదలతో కాన వచ్చిన పరిణామ క్రమంగూడా ఒకటి. పాతికేళ్ళకు మునుపు ఒక పెద్ద పాళెగాడు వేటకోసం వచ్చి అడవిలో వేసుకున్న నాలుగైదు గుడారాలకు మల్లే ఆ గ్రామంలో చెదరు చెదరుగా కొన్ని యిళ్ళు కనిపించేవి. ఒళ్ళు వంచి పని చేయడంవల్లనైతేనేమి, పైవారి కృపా కటాక్షం అవ్వారిగా లభించడంవల్లనైతే నేమి, కొందర కొందరగా ప్రమోషన్లు అందుకుని పైమెట్టుకు చేరుకోగలిగిన ఉన్నతోద్యోగిలా కోటకొమ్మల గ్రామం కాలంతో పందెం వేసుకుని పట్టణంగా పరిణమించింది. పంచల స్థానాన్ని ఫ్యాంటు లాక్రమించుకున్నట్టుగా పాత యిండ్ల శిధిలాలపైన అందమైన సిమెంటు మేడలు వెలశాయి. నిగనిగలాడే నున్నటి క్రాపింగులా తారురోడ్లు ఏర్పడ్డాయి. పెట్టెలు, పట్టె మంచాలు, గవాక్షాలకు గుడ్డలు, తిడప దగ్గర గుడ్డ లాంటి పాదరక్షలు; చలువరాతి బొమ్మలు, చదువబడిన పుస్తకాలు, సుఖాసనాలు. స్థూలకాయాలు మొదలైనవి ఉన్నతోద్యోగి యింటికి హంగులు. పట్టణానికి గూడా దానికి కావలసిన హంగులు దానికి లేక పోలేదు బంకులు, షాపులు, సినిమాలు, హోటళ్ళు, ఆట మైదానాలు, ఉద్యానవనాలు మొదలైనవన్నీ కోటకొమ్మలలో చోటుచేసుకున్నాయి.

పదిమందిని వాకబుచేసి, పదివీధులు తిరిగిన తర్వాతగానీ సుబ్బరామయ్య తాశీల్దారుగారి యింటిని కనిపెట్టలేక పోయాడు. దొంగలు అలీబాబా యింటిని గుర్తుపట్టలేక పోవడానికి కారణమేమిటో పాఠకులకు తెలుసు. అప్పులని, ఆహారాని కని, యింకా మరికొన్నింటికని అదనంగా కొందరు తాశీల్దారులు ఏర్పడి వుండడంవల్ల అసలు తాశీల్దారుగారి యింటిని వెదకి పట్టుకోడంలో కొంత ఆలస్యమే వాటిల్లింది.

పట్టణంలోని యిండ్లకు వాస్తు

కాపాత్రానికి బొత్తిగా సంబంధం వున్నట్టు తోచదు. సంగీతం రానివాళ్ళు పాడడం వల్ల అధిదేవతలకు వికృత రూపం వాటిల్లిందని చెప్పనేర్చిన మన పెద్దలు, నగరాలలోని గృహనిర్మాణంవల్ల వాస్తు పురుషుడు చిత్రహింసలకు గురౌతున్నాడని ఎందుకు చెప్పలేదో మనకు తెలియదు! ముక్కోణాకారంగా ఒక జాగా కనిపించినాసరే, అక్కడొక కట్టడాన్నిలేవదీసే కక్కుర్తి పట్టణాలలోనే కనిపిస్తుంది. సూదిగొంతు, బానకడుపు అన్న సామెతకు రూపకల్పనలాగా తాసిలారుగారి యిల్లు వెడల్పు తక్కువ. పొడవెక్కువ. వీధిలో నిల్చున్నవారికి ఆ యింటితాలూకు వరాండా కనిపిస్తుంది. నాలుగడుగుల మేరకు గోడ. దానిపైన యినుప కమ్మీల అల్లిక. మూయబడివున్న రెక్కతలుపులు. ఈ యింటిలో మనుషులనేవాళ్ళున్నారా? ఉంటే ఎక్కడున్నారు? ఇంతకూ తాసిల్దారుగారున్నట్టా, లేనట్టా? ఎవరు చెబుతారు?

పదిపదిహేను నిమిషాలు వేచిచూచిన తర్వాత సుబ్బరామయ్య ఒక్కింత సాహసానికి పూనుకుని రెక్కతలుపు మీద చెయివేసి చూచాడు. లోపల గడియ పెట్టలేదేమో, తలుపు మెల్లగా తెరచుకుంది. అనుమతి పత్రం లేకుండా విదేశంలో అడుగు పెడుతున్న పరదేశీయుడిలా సుబ్బరామయ్య మెల్లగా లోపల కాలుమోపాడు.

విశ్చల కాసారంలో సంచలనం చెలరేగడానికి ఒక చిన్న గులకరాయి పడినా చాలు. సుబ్బరామయ్య వరండాలో అడుగుపెట్టిన మరుక్షణంలో గ్రామసింహ గర్జన ఒకటి ఉన్నట్టుండి ఉద్వేలంగా చెలరేగింది. సుబ్బరామయ్య—ఒక్క ఉదుటున బయటికి లంఘించేవాడే! కానీ ఆ కుక్క ఓ గొలుసుకు గట్టిగా బంధింపబడి వుండడం అతడి కొంచెం ధైర్యాన్ని చేకూర్చింది. ఇజ్జూ.. జూ.... అంటూ అతడొక రకంగా కుక్కను సముదాయించడానికి కూడా ప్రయత్నించాడు. పరాయి వ్యక్తి తన ఎదుటి నుండి నిష్క్రమించేదాకా ఆ కుక్కనోరు మూసే ధోరణిలోలేదు. ఒరుల సాయం లేకుండా కుక్కలను వూరుకోబెట్టడమెలాగో సుబ్బరామయ్యకు తెలియదు....

ఆ ఆపత్సమయంలో, షైగర్, ఆటూఓ అదలింపు వినిపించడమేమిటి, షైగర్ నోటికి తాళం పడట మేమిటి రెండూ ఒక్కసారే జరిగాయి. వరండాలో ఓమూలగా వేయబడివున్న వాలు కుర్చీపైన పది పన్నెండేళ్ళ కుర్రవాడొకడు పవ్వళించి వున్నా డన్నవిషయం గూడా సుబ్బరామయ్య కప్పుడే తెలిసింది....

"తాసిల్దారుగా రున్నారా బాబూ?" సుబ్బరామయ్య వీలైనంత వినయంగానే ప్రశ్నించాడు.

"అప్పుడే తెల్లవారిందా?" అంటూ ఆప్రశ్నకు ప్రత్యుత్తరంగా యింకొక ప్రశ్నవెలువడింది.

సుబ్బరామయ్య విస్తుపోయాడు. గంట ఎనిమిదికావస్తున్నది. ఇంకాతెల్లవారక పోవడ మేమిటి? తొలి కోడి

కూయగానే తెల్లవారిం దనుకోడం పల్లెల్లో సాంప్రదాయం. ఇక్కడెన్ని గంటలకు తెల్లవారుతుందో తనకు తెలియదు.

ఐనా ఆ అనవసరమైన గొడవ తన కెందు కన్నట్టుగా సుబ్బరామయ్య మళ్ళీ అసలు విషయంలోకే వచ్చాడు. "తాసిలారుగారితో కాస్త పనుండి వచ్చాను. ఆయన్నొకసారి కలుసుకో వాలి...."

"అందుకు నా పర్మిషన్ దేనికి?"

"పర్మిషన్ కాదు. తాసిల్దారుగారు యింట్లో వుంటే కలుసుకోవచ్చునని.."

"అవునుమరి. ఇంట్లోవుంటే కలుసు కోవచ్చు. లేకుంటే కలుసుకోవడం సాధ్యంకాదు. అన్నివిషయాలూ నీకు తెలిసేవున్నాయి. మరైతే నన్నడగడ మెందుకూ?"

"అదికాదు బాబూ!"

"ఏది కాదు?"

సుబ్బరామయ్య నిరుత్తరుడై పోయాడు. వివాదపరిష్కారం కోసం ప్రపంచ రాజ్యాలు కొన్ని చర్చలు జరుపుకోవడం కద్దు. ఏ ప్రాతిపదిక పైన ఆ చర్చలు జరగాలన్నది మొట్ట మొదటి సమస్య. ప్రాతిపదిక మాట దేవుడెరుగు. వివాదం పరిష్కారం కావాలన్న సదుద్దేశం ఉభయ వర్గాలలో ఏ ఒక్కదానికి లేకపోయినా చర్చలాక ప్రహసనంగా పరిణమించడం సంభ వమే! కుర్రవాడితో సుబ్బరామయ్య సంభాషణ అంతకంటే మెరుగ్గా లేదు.

పదినిమిషాలవరకూ సుబ్బరామయ్య మౌనంగా వుండిపోయాడు. తాసిల్దారు గారు లోపలవున్న పొలకువలేవీ కాన రావడంలేదు. మౌనవ్రతాన్ని పాటిస్తూ నిలువుకాళ్ళశిక్ష అనుభవిస్తూ తా నెంత కాలం యిలా తాసిల్దారుగా రింటి వసారాలో గడపవలసి వున్నదో అత నికి బోధపడలేదు. 'ధైర్యే సాహసే లక్ష్మీ' అన్నారు పెద్దలు. మళ్ళీ ఒక సారి ఆ కుర్రవాణ్ణి కదిపి చూడదలచు కున్నాడు సుబ్బరామయ్య.

"చూడు బాబూ! ఒకవిషయం తెలిస్తే చాలునాకు! అయ్యగారు యింట్లోవున్న ట్టులేరు. ఆయన ఎప్పుడు వస్తాడో తెలిస్తే వెళ్ళిపోతాను...."

చదువుతున్న పుస్తకాన్ని టేబిలుపై కి విసరి ఆ కుర్రవాడు సుబ్బరామయ్య వైపొకసారి తీక్షణంగా చూచాడు— "ఆయనెప్పుడొస్తారో నాకేం తెలుసు? గంటల్ని తెలిపే గడియారంలా నేను తాసిల్దారుగారి రాకపోకల్ని తెలిసే యంత్రాన్ని గాను...."

సుబ్బరామయ్య ముఖాన ప్రత్యే కంగా చింతపిక్కు చల్లవలసిన అవ సరం లేకపోయింది! అచట పుట్టిన చిగురు కొమ్మయిన చేవ. అంటూ ఒక పద్యాన్ని ఎక్కడో చదివినట్టు జ్ఞాపకం! బహుశా ఆ మాటను యిలాంటి వాళ్ళను గురించే అన్నారేమో! ఇంతకూ ఒకరినని ఏం లాభం? పల్లెలో తా వా కుర్రకుంకను చదివించకుండా పొలం దారి పట్టించి వుంటే యిలా నామర్దా పాలు కావలసివచ్చేది గాదు.

కత్తివేటుకు నెత్తురుచుక్క లేని

ముఖంతో సుబ్బరామయ్య వెలుపలికి వచ్చాడు. మతిచెడిన వాడిలా బజార్ల వెంట తిరిగాడు. ఎండకు మగటిమి హెచ్చి, గంట పదిన్నర కావస్తుండగా సుబ్బరామయ్య కొక విషయం జ్ఞప్తికి వచ్చింది. ఉదయం ఆరింటికల్లా సూర్యుడు పూర్వాద్రి శిఖరాన పొడ సూపినట్టుగా పది గంట లయ్యేసరికి ఉద్యోగు లందరూ ఆఫీసుకు చేరుకోక పోరు. తాసిల్దారుగారిని సంధించటాని కదే సజావైన పద్ధతి....

సుబ్బరామయ్య వెళ్ళేసరికి తాలూకాఫీసు ప్రాంగణం జనంతో కిటకిట లాడి పోతోంది. అప్పుడప్పుడే గుమస్తాలు కుర్చీలలోకి సర్దుకుంటున్నారు. వసారాలో తనకు తారసిల్లిన మొదటి బంట్రోతునే అడిగి చూచాడు సుబ్బరామయ్య— "బాబ్బాబూ! తాశీల్దారుగారిని కలుసుకోవడానికెప్పుడు వీలవుతుందో తెలుసుకోవాలి. ఆయనతో కాస్త పనుండి వచ్చాను" అన్నాడు.

పల్లెటూరి వాలకాలతో వ్యవహరింపవలసి వచ్చేసరికి బంట్రోతులే గెజటడ్ ఆఫీసర్లు. సుబ్బరామయ్య వైపొకసారి ఎగాదిగా చూచాడు జవాను— "ఆ శాడికి నువ్వొక్కడివే పనులున్నవాడివి. ఇక్కడ తాసిల్దారుగారికిగానీ, నాకుగానీ పనులు లేవనుకుంటున్నావేమిటి?"

"అబ్బే, నేనామాట అనలేదే!" చిక్కమొగం పెట్టాడు సుబ్బరామయ్య.

"ఐతే, నా మామూలు నా కిలా పడేయ్...."

మారుమాట లేకుండా ముడుపు చెల్లించుకున్నాడు సుబ్బరామయ్య.

వివరాలు వెల్లడింపబడ్డాయి—

తాసిల్దారుగారు ఊరిలో లేరు. క్యాంపుకు వెళ్ళారు. సాయంకాలానికి తిరిగి రాగలరు. బడలికతో వుంటారు గనుక అప్పటికప్పుడు ఆయనను సందర్శిస్తే పని సానుకూలం గాకపోవచ్చు. రాత్రి భోజనానంతరం ఆయన కెవరితోనైనా కాసేపు బాతాఖాని వేయాలని వుంటుంది. భోజనం చేసి వచ్చి నింపాదిగా తాంబూలం సేవిస్తూ ఆయన వరండాలో కూర్చుంటారు. ఆయనను కలుసుకోడాని కదే అనువైన సమయం ...

సుబ్బరామయ్య మళ్ళీ రోడ్డుపై కెక్కాడు. కనిపించిన హోటల్లోకి వెళ్ళి నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని తిన్నశాస్త్రం ముగించాడు. ప్రొద్దు పోయేటంతవరకూ పుర వీధుల్ని సర్వే చేశాడు గళ్ళతో నిండిన విసీల వవ నాలను వ్రేలాడదీసినట్టుగా, చిరుచీకట్లు ముసురుకోసాగాయి. సుబ్బరామయ్య కాళ్ళు అతడి నొకచోట నిలువనీయడం లేదు. అవి అప్రయత్నంగా అతణ్ణి తాసిల్దారుగారు నివసిస్తున్న వీధిలోకే తీసుకునివెళ్ళాయి. హఠాత్తుగా ఒకచోట నిల్చుని ముందువెనుకలు చూచుకునేసరికి అతడు తాసిల్దారుగారి యింటి ఎదుటనే వున్నాడు.

సూ దితో పొడిచినట్టుగా సుబ్బ రామయ్యకిప్పుడో విషయం జ్ఞప్తికి వచ్చింది. ఉదయం కనిపించిన ఆ కుర్ర వాడు. ఆ తర్క విద్యాకుశలుడు. ఆ బాల మేధావి మళ్ళీ-వరండాలో కని పిస్తే అతనితో మాట్లాడడం తన చేత గాదు. భగవంతుడి అనుగ్రహంవల్ల అతగా డక్కడ లేకుంటే చాలు. అదే పది వేలు!

తక్కుతూ, తారుతూ వీధి గుమ్మం లోకి వెళ్ళి లోపలికి తొంగిచూచాడు సుబ్బరామయ్య.

"ఎవరండీ? ఏం కావాలి?"

సౌజన్యం వుట్టిపడుతున్న కంఠ స్వరం. గగనంనుండి భూపతనమై పోతున్నవాడికి అంతర్మధ్యంలో ఒక పూల సెజ్జ దొరికినట్టున్న పలకరింపు. ఆ మాటలు నిజంగానే తనకు విని పించినట్టుగా తానొక భ్రమాప్రమాదానికి లోనయ్యాడా?

సుబ్బరామయ్య నలా పలకరించిన వ్యక్తికి పాతికేళ్లుంటాయి. ఆ యువ కుడు వాలుకుర్చీలో కూర్చుని వార్తా పత్రిక చూచుకుంటున్నాడు....

"నిలబడిపోయారెందుకు? అదిగో, బెంచీపైన కూచోండి...."

"అయ్యగా రున్నారా బాబూ!"

"ఏవో కాగితాలు చూచుకుంటు న్నారు. ఆ పని కాగానే కలుసు కుందురుగాని. అలా కూచోండి...."

పది నిమిషాల్లో అతడు పత్రిక చూడడం పూర్తిగావచ్చింది. కళ్ళజోడు సర్దుకుంటూ అతడు ప్రశ్నించాడు—

"ఆఫీసులో కలుసులేకపోయారా?"

"వెళ్ళాను. క్యాంపు వెళ్ళారని తెలిసింది. ఉదయం యిక్కడికే వచ్చాను. అప్పుడింట్లో లేరు...."

"ఏ వూరునుంచి వచ్చారు?"

"మాది కంకిమిట్ట. అబ్బాయి స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాడు. ఏదో ఉద్యోగంకోసం అప్లికేషన్ పెట్టాడు. గెజటెడ్ ఆఫీసరుగారి సంతకం కావల్సి వచ్చింది...."

"కంకిమిట్ట అన్నారు గదూ! మీ అబ్బాయి బహుశా తాళ్ళపూడి హైస్కూల్లో చదువుకుని వుంటాడు. మార్కులెలా వచ్చాయి?"

"నాలుగు వందలకు పదో పది హేనో తక్కువ."

"కాలేజికి పంపలేకపోయారా?"

"అబ్బో, ఏసుగకు ఆహారం అందించగలమా బాబూ! పెద్ద కొండ లకు సన్నలు వేయదలచుకోలేదు. ఎవడి కెంత ప్రాప్తమో అంతే దక్కాలి మరి!"

"అది చాలా పాత సిద్ధాంతం! ఎవడికేది అవసరమో వాడి కది

దక్కాలి. ఎవడికెంత అవసరమో వాడి కంత దక్కాలి. చదువుకోగలిగిన వాడికి అవకాశాలు లేవు. చదువుపైన బొత్తిగా ధ్యాసలేనివాడికి అవకాశాలు దండిగా వున్నాయి. ఎలా వుందంటారు! అజీర్ణ రోగికి విందు భోజనాలున్నూ, ఆకలిగొన్నవాడికి ఉపవాసాలా ?"

"ఇదిగో శంకరం! ఎవరితో మాట్లాడుతున్నావు ?"

శంకరం లేచివెళ్ళి కిటికీలోనుంచి లోపలికి చూస్తూ "మీకోసం ఎవరో వచ్చారండీ నాన్నగారూ! సంతకం కావాలిట!" అన్నాడు.

"నా కిక్కడ బోలెడన్ని కాగితా లున్నాయి మరి!"

"గంట ఎనిమిది దాటితే ఈ వూరి హోటళ్ళలో భోజనా లుంటాయటండీ నాన్నగారూ! ఉసూరుమంటూ పస్తు పడుకోవలసిందే!"

"అవునవును. ఆ మాటా నిజమే! ఎవరతను? లోపలికి రమ్మను..."

ఎదుటనున్న కాగితాలను అవ్వలికి తోసి, తాసిల్దారుగారు భేటీ యివ్వడానికి సిద్ధంగా కూర్చున్నారు. సుబ్బరామయ్య గూడా గదిలోపలికి వెళ్ళాడు. శంకరం గుమ్మంలోకి వచ్చి వీధి వైపు చూడ సాగాడు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడచి పోయాయి.

అలాంటి సందర్భాల్లో తాసిల్దారు గారు అడగవలసిన ప్రశ్నలు చాలా వున్నాయి. ఎవరు నువ్వు? ఏ వూరు? వి. యం. సర్టిఫికెట్టు ఎక్కడ? రివెన్యూ యిన్స్పెక్టరు రుజువు పరిచాడా?.... అలాంటి ప్రశ్న లేవీ శంకరానికి వినిపించలేదు. నాన్నగారేం చేస్తున్నట్టు?

శంకరం మళ్ళీ కిటికీదగ్గరికి వెళ్ళాడు.

తాసిల్దారుగారు సుబ్బరామయ్యవైపు చూస్తున్నారు. సుబ్బరామయ్య తాసిల్దారుగారివైపు చూస్తున్నాడు. ఇద్దరి ముఖాలలోనూ తొలినాటి జ్ఞాపకాల కోసం గింజుకుంటున్న సూచనలు కానవస్తున్నాయి. ఆఖరుకు తాసిల్దారు గారే జయించారు.

"నువ్వటోయ్ సుబ్బరామయ్యా! ఎంతగా మారిపోయావ్, ఏం కథ! అన్నట్టు ఈ తాలూకాలోనే నా మీ వూరు?"

సుబ్బరామయ్య కుర్చీ స్వీకరించడాని కింకా జంకుతూనే వున్నాడు—

"గుర్తురావడంలేదా నేను! నీ వెనుక దస్కులో కూర్చునేవాణ్ణి. వెంకటేశ్వరరావుని! హిస్టరీ మేష్టరుగారిని గిరీశం అనేవాళ్ళుగదూ! ఆయనకు ప్రియశిష్యుడినైనందున నన్ను వెంకటేశం అంటుండేవాళ్ళు. అందుకు

కొగట్టుగా కొన్ని దుడుకుపనులుగూడా చేస్తుండేవాడివి. ఒకటి రెండుసార్లు పిరాచల్లి నీ చొక్కాగూడా ఖరాబుచేసి నట్టు జ్ఞాపకం....చూచావా శంకరం.... వాకు హైస్కూలు జీవితంనాటి స్నేహితులెవరూ లేరవి చెబుతూండేవాడిని. సుబ్బరామయ్య స్వయంగా వచ్చేశాడు....ఎందరోయీ బిడ్డలు?"

"ఇద్దరు మగబిడ్డలు. ఇద్దరాడబిడ్డలు...."

"బాగానేవుంది. పడవకు ఒడిదుడుకులు లేవన్నమాట! చాలాకాలానికి కలుసుకున్నాం. ఇప్పుడు వెళ్ళాలన్నా నీకు బస్సులులేవు. ఈ రోజంతా నా కోసం వేచి వుండడంతోనే సరిపోయింది గనుక ఈ పూట నీ కిక్కడే భోజనం! ....పీటలు వేయమంటావా శంకరం!"

సుబ్బరామయ్య యిరకాటంలో పడ్డాడు. హైస్కూల్లో చదువుకున్న రోజుల్లో యితణ్ణి 'ఒరేయ్' అని పిలిచేపాటి చనువు తనకుండేది. ఇప్పుడు ఏకవచనంతో సంబోధించడానికైనా మనసొప్పడంలేదు. ఇక్కడినుంచి వీలైనంత త్వరగా బయటపడితే బాగుండును! కానీ, యితడు భోజనానికి వుండిపొమ్మంటున్నాడు! హోదాలో గొప్పవాడు. బాల్యస్నేహాన్ని పాటించి అతిథ్యం యివ్వదలచుకుంటున్నాడు. వద్దనడం ఏం బాగుంటుంది?

భోజనాలు కొనసాగుతుండగా శాస్త్రులుగారు తమ సంతానాన్ని మిత్రుడికి పరిచయం చేయసాగారు. "శంకరాన్ని చూచావుగా సుబ్బరామయ్యా! వాడే పెద్దవాడు. బి. కాం. ప్యాసై స్టేట్ బ్యాంకులో పనిచేస్తున్నాడు. వీడి తరవాత యిద్దరాడపిల్లలు. పెద్దమ్మాయి పెళ్ళయింది. రెండో అమ్మాయి హాస్టల్లో వుంటూ కాలేజిలో చదువుకుంటోంది. అదిగో వాడే చిన్నబ్బాయి, చిట్టిబాబు!"

హాల్లోనుంచి వరాండావైపు వెళుతున్న చిట్టిబాబు ద్వారం దగ్గర ఆగి,

---

★ మేజిస్ట్రేటు : "పోట్లాట జరుగుతున్నప్పుడు నువ్వక్కడే వున్నావుకదా? ఫిర్యాదికి ఎందుకు సహాయం చెయ్యలేకపోయావ్?"

సాక్షి : "ముందే ఎల్లా తెలుస్తుందండి, ఎవరు ముద్దాయో, ఎవరు ఫిర్యాదో?"

సుబ్బరామయ్యవైపు కొరకొర చూడ సాగాడు—

"ఆ అబ్బాయిగారిని యిదివరకే చూచాను. ఉదయం ఒకసారి యిక్కడికి వచ్చాసుగదూ! అప్పుడు కనిపించాడు."

"నేను వూళ్ళో వున్నదీ, లేనిదీ చెప్పలేదన్నమాట!"

"ఇన్, అవుట్ అంటూ అక్కడొక బోర్డుండగా ప్రత్యేకంగా నేను చెప్పడం దేనికి నాన్నా!"

"అదీ పాయింటే! కాదంటావా సుబ్బరామయ్యా!"

"వ్రేలెడంత వున్నాడో లేదో, తల బిరుసుతనం మాత్రం బోలెడు ..." పుస్తకం చేతబట్టుకుని మేడ మెట్లెక్కుతున్న శంకరం తమ్ముడివైపు చురచుర చూచాడు. అన్నదమ్ములిద్దరూ ఒకేసారిగా రంగంనుంచి తప్పుకున్నారు.

"పసితనం గదండీ మరి...." సుబ్బరామయ్య సర్దిచెప్పచూచాడు.

"అబ్బే, అదికాదులేవోయ్ సుబ్బరామయ్యా!"

"ఏదికాదు?" సుబ్బరామయ్య తలపైకెత్తి సాభిప్రాయంగా తాసిల్దారుగారివైపు చూడసాగాడు. ఎంతకూ వివరణ లభించకపోయేసరికి మళ్ళీ అతడే ఉపక్రమించాడు—

"ఈ చిట్టిబాబు అశంకరానికి తమ్ముడుగావడమే విచిత్రం!"

తాసిల్దారుగారు అటూ ఇటూ కలయజూచి మరెవ్వరూ వినడంలేదన్న నిర్ధారణకు వచ్చినట్టుగా "పీకో రహస్యం చెప్పనా సుబ్బరామయ్యా" అన్నాడు.

"అంత కంటేనా!"

"శంకరం పుట్టిననాటికి నేను గుమాస్తాని! ఓ చిన్నపెంకుటింట్లో నివసిస్తుండే వాణ్ణి. కూరానారా తెచ్చుకోవాలంటే స్వయంగా సంచీ చేత పట్టుకుని మార్కెట్టుకు వెళ్ళి వచ్చేవాడివి. ఒక్క మాఆవిడ పైనతప్ప ప్రపంచంలో మరెక్కడా నా అధికారం సాగేదికాదు. శంకరం ఓ గుమాస్తా కడుపున పుట్టాడు. పది పన్నెండేళ్ళ వరకూ యించు మించుగా అదే వాతావరణంలో పెరిగాడు...."

ఆశ్చర్యంతో వింటున్నాడు సుబ్బరామయ్య.

"చిట్టిబాబు సంగతలా కాదు.. వీడు బుడి బుడి నడకలు నేర్చుకునేసరికి నేను తాసిల్దారునై పోయాను...."

"మజ్జిగ వేసుకున్నారా" అంటూ హాల్లోకి వచ్చిన ఆ యింటి యిల్లాలు నోరు తెరచుకుని విగ్రహంలా కూర్చున్న సుబ్బరామయ్య వాలకాన్ని చూచి విస్తుపోయింది.

***

[గత సంచిక తరువాయి]




విహారి & శాలివాహన

"ఎవ రెవరు?" అని గుప్పిలిమూసి సైగచేస్తూ రఘును అడిగాడు శంకరం.

కళ్ళతోనే సమాధానం చెప్పబోయాడు రఘు "నువ్వా రేణూ" అని. రేణుక అక్కడలేదు. శంకరం మౌనం వహించాడు.

"శంకరం చెప్పే దేముందమ్మా? ఇంకా ఈ ప్రశ్నలన్నీ ఎందుకు,ముహూర్తం చూస్తే సరి" అన్నాడు రఘు.

"ముహూర్తాని కేమిటి? రే పాసుబ్బావధాన్లుగారిని పిలిచి లగ్నాలు చూడమంటాను" అంటూ లోపటికి వెళ్ళింది సౌభాగ్యమ్మ.

ఆవేళ సాయంత్రం పార్కులో కూర్చుని శంకరం, రేణుక కబుర్లు చెప్పుకుంటూ వుండగా వచ్చాడు వేణుమాధవ్. కాళిదాసు, మాలతి ఒకళ్ళ తర్వాత ఒకరుగా శంకరానికి అందర్నీ పరిచయం చేసింది రేణుక.

మాటల మధ్యలో అడిగాడు వేణుమాధవ్. "ఇవాళ పిక్చరుకు వెళ్దామా అండీ. బెన్‌హర్ రిలీజ్ అయింది. సరదాగా వుంటుంది."

రేణుకకూ వెళ్ళా లనిపించింది. లేచి వెళ్ళబోతూ "నువ్వు కూడా రా బావా" అంది.

శంకరం వెళ్దామా వద్దా అని ఆలోచించాడు. వెళ్తేనే బావుండు ననిపించింది అతను సమాధానం చెప్పేలోగనే వేణుమాధవ్ అన్నాడు.

"మీ బావగారికి ఇంగ్లీషు పిక్చరంటే పెద్ద ఇంటరెస్టు లేదేమో."

వేణుమాధవ్ మాటలు ములుకుల్లా తగిలాయి శంకరానికి. "నిజమే రేణూ! నేను రానులే, నువ్వెళ్ళరా" అన్నాడు.

నవ్వుతూ వేణుమాధవ్ వెనకగా వెళ్ళింది రేణుక.

తనను చూసి కాళిదాసు నవ్వినందుకు అవమానంతో కుంచించుకు పోయాడు శంకరం.

* * *

శంకరం వచ్చిన నాలుగవ రోజున పిక్నిక్‌పార్టీ ఏర్పాటు చేశారు రఘు, రేణుక. మొదట్లో తాము ముగ్గు రే వెళ్ళేటట్లు నిర్ణయించుకొన్నా, తీరా

బయల్దేరే సమయానికి కనీసం నాలుగో వ్యక్తయినా వుంటే బావుండు ననిపించింది రేణుకకు. దానికి కారణం ఆమెకు కాంట్రాక్టు బ్రిడ్జిమీద వున్న ఇంట రెస్టే. రఘూ అందుకు సరేనన్నాడు. వేణుమాధవ్‌ని పార్ట్నర్‌గా ఎంచుకుంది రేణుక,

వీళ్ళు నలుగురూ వెళ్ళబోతూ వుండగా మాలతి, కాళిదాసు వచ్చారు. మొహమాటానికి వాళ్ళనీ ఆహ్వానించాడు రఘు. మాలతి ఆనందంగా వస్తానని బయలుదేరితే, కాళిదాసు కొంచెం ఇబ్బందిగా వేణుమాధవ్‌వైపు కోపపు దృష్టి ప్రసరింపజేయసాగాడు. అది గమనించిన రఘు భావయుక్తంగా వేణుమాధవ్‌వైపు చూశాడు.

"రండి కాళిదాసుగారూ, సరదాకి తిరిగి రావటానికి సంకోచిస్తారేం ?" అన్నాడు.

"దాసుగారితత్వం ఎప్పుడూ కుంచించుకుపోవటమే" అంది రేణుక. అంతా గొల్లున నవ్వేరు.

రఘు కార్లోనూ, వేణుమాధవ్ కార్లోనూ బయల్దేరారు అంధరూ. సౌభాగ్యమ్మ లోలోపల విసుక్కుంటూనే వీళ్ళందరికీ కావలసిన తినుబండారాల్ని సమాయత్తం చేసింది.

బీచ్ వొడ్డున రెస్టుహౌస్‌లో దిగారు ఈ బృందం. అక్కడికి చేరినప్పటినుంచీ రేణుకకు పేక ఆడాలనే. కాళిదాసుకూ, మాలతికీ ఇది నచ్చలేదు. తామిద్దర్నీ వదిలేసి వీళ్ళు నలుగురూ ఆ ఆటలో మునిగిపోతే తమకు తోచదనే బాధతో వాళ్ళెలాగైనా ఆడకుండా చూడాలని నిర్ణయించుకున్నారు. కాని రేణుక స్వభావం తెలిసినవాళ్ళవటం వలన కొంత ఘర్షణ పడ్డ తర్వాత తమ ఓటమిని అంగీకరించారు.

వేణుమాధవ్, రేణుక - రఘు, శంకరం పార్ట్నర్స్‌గా మొదలెట్టారు ఆట. రేణుక, వేణుమాధవ్‌ని ఆటలో తన జోడుగా ఎన్నుకోవటం శంకరానికి బాధ కలిగించింది. రేణుక వేణుమాధవ్‌ను బలవంతపెట్టి తన జోడుగా వుండటానికి ఒప్పించగానే, కాళిదాసు వాో ప్రక్కగా వెళ్తూ సన్నగా అన్నమాటలు శంకరం మనస్సును కలచివేసినై.

"కమింగ్ ఈవెన్ట్స్ కాస్ట్ దైర్ షేడోస్. హుం.... అంతే.... అంతే..."

దానికి తోడు ఆట మొదలెట్టినప్పటినుంచీ వేణుమాధవ్ ఒకటే జోక్సు. ఇవన్నీ నచ్చలేదు శంకరానికి. పరధ్యాన్నంగా ఆటలో వీగిపోవటం ఎక్కువైంది శంకరం, రఘులకి.

"ఏవన్నయ్యా ! ఏదో కోసివిగా ఇప్పుడు చెప్పు. నేను ఫస్టా, నువ్వా ఫస్టా ఈ గేంలో ?"

"సర్లే నీదీ ఒక ఆటేనా. అంతా ఎగ్రెసివ్ బిడ్డింగూ నువ్వూను."

"రేణుక నేచరే అంత" శంకరం వెంటనే అనేశాడు.

"కాకపోతే ఆడపిల్ల ఇంజనీరింగ్ చదివి డ్రాఫ్ట్స్‌మన్‌గా ఉద్యోగం వెలగ

బెట్టటమేఁవిటి? కాంట్రాక్ట్ బ్రిడ్జి లో పెద్ద నేషనల్ ఛాంపియన్ కావాలని ప్రయత్నించటం మేఁవిటి? అంతా ఎగ్రెసివ్ నెస్!" అన్నాడు రఘు.

రేణుక వాళ్లిద్దరి కామెంట్స్‌నీ తేలిగ్గా తీసుకుంది. ఇంతలో కాళిదాసు అన్నాడు "అయితే మీ మరదల్ని షైనా వాళ్ళలో కలిపి వేశారు శంకరంగారూ?"

అంతా సన్నగా నవ్వుకున్నారు. ఆటలో కుతూహలం సన్నగిలింది రఘుకి, శంకరానికి.

శంకరం అక్కడ్నుంచిలేచి "నాకు విసుగ్గా వుంది. కాస్సేపు రెస్టు తీసుకోవాలి." అంటూ తోటలో మరో చెట్టు క్రిందికి దారి తీశాడు....

శంకరం అలా వెళ్ళటంతో ఒకరి మొహా లొకరు చూసుకున్నారుమిగిలిన వాళ్ళు.

శంకరం రెండడుగులు ముందుకు వేసి వెనక్కి తిరిగి రేణుక నుద్దేశించి "ఇలారా...." అన్నాడు. రేణుక మాట్లాడకుండా లేచి వెళ్ళింది.

ఇద్దరూ వచ్చి, తోటలో వో మూల జామిచెట్టు క్రింద అరుగు మీద కూర్చున్నారు. కొద్దిక్షణాలు ఎవ్వరూ మాట్లాడలేదు. శంకరం మనస్సులో భయం ఆవహించింది — రేణుకను సూటిగా ప్రశ్నిస్తే ఏమనుకుంటుందో అని. కొంచెంసేపు తటపటాయించి చివరకు ధైర్యం తెచ్చుకుని అడిగేశాడు.

"రేణూ! నేనిలా అడుగుతున్నానని మరోలా భావించకు. నిన్నుగురించి రకరకాలుగా అనుకొంటున్నా రేవిఁటి వీళ్ళంతా?"

రేణుక తేలిగ్గానవ్వి, శంకరం కళ్ళలోకి సూటిగా చూసింది. ఆ చూపులకి తట్టుకోలేక పోయాడు శంకరం. సిగ్గుపడి తలదించు కున్నాడు.

"మాధవ్ గారు నాకు ఆఫీసులో అధికారి. వారికి నేనన్నా, నాకు వారన్నా గౌరవం, అభిమానం. కారణాలు ఇదమిత్థంగా చెప్పలేను. ఇంత కంటే వివరించి చెప్పవలసిన దేమీ లేదు...."

ఆమె ఇంకా ఏదో అనబోయేలోగా వేణుమాధవ్ అక్కడికివచ్చి "ఏమండీ! బీచ్‌లో ఓ అరమైలు దూరాన పెద్ద చేపని పట్టార్ట. చూసొద్దాం, వస్తారా?" అన్నాడు.

రేణుక కుతూహలంగా శంకరం మొహంలోకి చూసింది. అతను కొంచెం విసుగ్గా "నేను రాను" అన్నాడు దృఢంగా.

"నే వెళ్ళొస్తా బావా. మనం తర్వాత తిరిగ్గా మాట్లాడుకుందాం" అంటూ లేచి ఛెంగున నడక సాగించింది.

శంకరం మనసు చివుక్కుమంది.

**సీరియల్**

రేణుక వేణుమాధవ్ రాగానే,మాట్లాడు తున్న విషయాన్ని ఆపివేసి అతనితో బయలుదేరి వెళ్ళటం శంకరానికి నచ్చ లేదు. తను తా మిద్దరికీ ముఖ్యమైన విషయాలు మాట్లాడుదా మనుకుంటూ వుంటే, వాటికంటే ముఖ్యమైనట్లుగా వేణుమాధవ్‌తో షికారుకు బయలుదేర టంలో రేణుక అభిప్రాయ మేమిటో అతనికి అర్థం కాలేదు. ఆమెకు తన కంటే ఆ వేణుమాధవ్ ముఖ్యుడా ? అంత ప్రాముఖ్యాన్ని అతనిలో ఏం చూస్తోంది ?

మనసులో మొలిచే తన ప్రశ్నలకు తనకే ఎన్నో సమాధానాలు స్ఫురిం చాయి కాని ఒక నిర్ణయాన్ని నిర్ణయించు కోటానికి శంకరానికి ధైర్యం చాలలేదు. అయితే ఒకటిమాత్రం నిజం. రేణుకలో కొంత మార్పు వచ్చింది. ఈ రేణుక ఇదివరకటి రేణూ కాదు తన చిన్న నాటి నెచ్చెలి, అనుంగు ముద్దుల కాదు. ఎప్పుడూ "బావా బావా" అంటూ తనతో కలిసి తిరుగుతూ, ఆటల్లో పాటల్లో తనతో జట్టుకట్టి, తను లేనిదే లోకం లేదన్నట్లుగా ప్రవర్తించిన రేణుక కాదు ఇప్పుడు. ఇప్పటి రేణుక రూపం వేరు, ప్రవర్తన వేరు. అవును మరి ఈ రేణుక ఉద్యోగి (ని). అధు నాతన వేష భాషలతో, సొసైటీ లేడీగా పరిగణింపబడే పడతి. అలాంటి యువ తిని గురించి తా నసలు ఆలోచించడం దేనికి? ఆనాడు, ఇరవై సంవత్సరాలకు పూర్వం లక్ష్మీపతిగారికి ఆడ సంతానం కలిగిందని తెలుసుకుని "నీకు పెళ్ళాం పుట్టిందిరోయ్" అని అమ్మ అన్నం దుకా ? తను ఆ మాటను తన మన సులో అంటుపెట్టుకోగా,లక్ష్మీపతిగారు, అమ్మ, నాన్న - రేణుక కూడా - ఆ అంటుకు అనుకూల వాతావరణాన్ని సృష్టించి, నీరు పోసి పెంచినందుకా ? లత తీవలుసాగి చిగిర్చి పుష్పించబోయే తరుణంలో ఏదో వికృత శక్తి అడ్డు తగిలినందుకా ?

నిశ్చలంగా వున్న నీటి దొరువులో గులకరాతిని విసిరినప్పుడు చక్రాల్లాంటి అలలు ఒకదాని వెంట మరొకటి ఉద్భ వించి నీటి నంతటిని కలచినట్లుగా ఆలో చనలు అతన్ని పిచ్చివాడిని చేశాయి.

ఆ మర్నాడు మరో చిత్రమైన సంఘటన జరిగింది.

మధ్యాహ్నం మూడు గంటలౌ తోంది. ఇంటిముందు చిన్న కారు ఆగింది. వేణుమాధవ్ దిగి హుందా వుడిగా లోపలికి వచ్చాడు. అతని రాక ఆశ్చర్యాన్ని కలిగించింది అందరికీ. అతను వాళ్ళింటికి రావటం అదే మొదటిసారట. రేణుక అతన్ని చిరు నవ్వుతో లోపలికి ఆహ్వానించింది.

వేణుమాధవ్ వస్తూనే "ఇంతకంటే ఆశ్చర్య కరమైన విషయం మరొ హటి వుందా ?" అన్నాడు.

అనుకోకుండా వేళకాని వేళ వేణు మాధవ్ రావటం, విషయమేదో చెప్ప కుండానే అలా ప్రశ్నించటంతో రేణుక మొదట్లో విస్తుపోయింది. "ఏం జరిగిం దండీ" అని అడిగింది.

హాల్లో పడుకునివున్న సౌభాగ్యమ్మ ఆమె కెదురుగా కూర్చుని పేపరు

చదువుకుంటున్న శంకరం, చెవులు రిక్కించి వినసాగేరు.

"మన టైపిస్టు సరోజిని తెలుసు కదూ"

"విశ్వేశ్వరరావుని డిస్మిస్ చేయించాలని చూసిన సరోజినేనా" రేణుక అడిగింది.

"ఆఁ ఆఁ! అత నేదో తనని అన రాని మాటలు అన్నాడని అతనిపై కక్ష కట్టిందా? ఇప్పుడా విశ్వేశ్వరరావునే వివాహం చేసుకుంటోంది."

"అలాగా!"

"అలాగా అని మెల్లగా అంటారేం! అసంభవ మనుకున్నది సంభవంకావట మంటే ఇదే. వాళ్ళిద్దరి మధ్య వున్న మిట్టపల్లాలు ఏమైనట్లు? కులమతాలు అడ్డు రాలేదా? అభిప్రాయ భేదాలు అంత రించాయా? ఏమిటి దీనికి రీజనింగ్?"

రేణుక నవ్వింది. "అప్పుడేమైనా అల్లరి చేస్తాడేమోనని భయపడింది. తర్వాత స్నేహం కలిసింది. పెళ్ళి చేసు కుంటున్నాడు. ఇక కులమతా లంటారా ఎన్నడిగితే వాటికి ప్రాధాన్యం ఈయ టం అవివేక మంటాను మనసులు కలి సిన యువతీ యువకుల మతం ప్రేమ మతమే. అంతస్థు అనురాగమే."

"సరిగ్గా నా అభిప్రాయమూ అదే నండి రేణుకాదేవిగారూ. మనం సెక్యు లర్ స్టేట్‌లో వున్నాం. మనకు కుల మతాల ప్రసక్తి అనవసరం. సోష లిజంవైపు పురోగమిస్తున్నాం. ధని కులు, బీదవాళ్ళు అనే ఒచక్షం అనవ సరం. ప్రేమే లోకం, దైవం, ధ్యేయం."

రేణుక గొల్లున నవ్వింది.

"కవిత్వం చెప్పారుగానీ, అసలు నన్నడిగితే అంతా మిధ్య అంటాను" అని ముగించింది తమాషాగా చేతులు త్రిప్పుతూ.

వేణుమాధవ్ కూడా నవ్వేడు.

వారి సంభాషణంతా వింటున్న సౌభాగ్యమ్మ, శంకరం ముఖ ముఖాలు చూసుకున్నారు.

ఆ రోజునుంచి రేణుక అంటే తనకున్న అభిప్రాయాన్ని శంకరం తప్పనిసరిగా మార్చుకున్నాడు. రేణుక, వేణుమాధవ్‌ల అభిప్రాయాలు, అభి రుచులు ఒకటేనని నిశ్చయించు

---

లాయరు జడ్జితో :— "యువరానర్! మా తరపున సాక్షులిద్దరూ రాలేదు. కేసు వాయిదా వెయ్యాలని కోరుతున్నాను."

జడ్జి :— "అరుగో, మీ సాక్షులిద్దరూ ఇప్పుడే వచ్చారు."

లాయరు :— "అయినా వాయిదా కోరుతున్నాను. వీళ్ళు రామని ప్రమాణం చేసి వచ్చారు."

కున్నాడు రేణుక ఇప్పుడు తనకేమవుతుంది ?

ఇకనుంచి తన ప్రవర్తనను మార్చుకోవాలి రేణుకతో ఎక్కువగా కలిసి తిరగటం, చనువుగా మాట్లాడటం, ఇవన్నీ తగ్గించటం, వీలైతే పల్లెటూరికి వెళ్ళిపోవటం మంచి దనిపించిం దతనికి

★ ★ ★

సౌభాగ్యమ్మ, రఘు, రేణుక ముగ్గురూ వుండగానే తన అభిప్రాయం తెలియజేశాడు శంకరం: "నేనిక వూరికి వెళ్తాను." అని. ముగ్గురూ ఆశ్చర్యపోయారు.

రఘు అన్నాడు. "నువ్విక ఎక్కడికీ వెళ్ళేపనిలేదు బావా. ఇక్కడ వుండిపోవటానికేగదా పిలిపించింది. పొలం వ్యవహారాలన్నీ మాట్లాడటానికి రామయ్యను రమ్మని యివాళే కబురు చేశానుకూడా. నీ విక ఆ పల్లెటూళ్ళో ఉండనక్కరలేదు."

"అది కాదు బావా ...." అని ఏదో చెప్పబోయాడు శంకరం.

"చూడు శంకరం. నువ్వేదో మనసులో బాధపడుతున్నట్లుంది. లేనిపోని అనుమానాలేమీ పెట్టుకోకు. నీ కిక్కడ ఏలోటూ రాదు. ఇది నీ స్వంత ఇల్లుగా భావించుకో. నాకు నువ్వొకటీ, రఘు వొకటీ కాదు" అంది సౌభాగ్యమ్మ, ఆప్యాయత వుట్టిపడే కంఠస్వరంతో.

శంకరంకళ్ళు నిజలాలైనాయి. అది గమనించిన రేణుక విస్తుపోయింది. శంకరం ఆంతర్య మేమిటో అర్థం కాలే దామెకు.

నాలుగు రోజుల్నుంచీ శంకరం ఎందుకో ముభావంగా ఉంటున్నాడని. ఏ విషయంలోనూ విశేషించి తనతో మాట్లాడటానికి అయిష్టతను కనపరుస్తున్నాడని రేణుక గమనించింది. ఎందువల్లనో అర్థం కాలేదు.

మనిషి మనసులోని భావాలు మాటల ద్వారానే వ్యక్తం కావాలి. అవసరాన్ని మించి అక్షరం కూడా ఎక్కువ మాట్లాడటానికి విముఖత వెలిబుచ్చు తున్నప్పుడు ఇక అభిప్రాయాల్ని కనిపెట్టే అవకాశ మేం వుంటుంది ?

శంకరంమీద జాలి కలిగింది రేణుకకు. తమ వ్యవహారాలు చూస్తూ పల్లెటూళ్లో కొన్నేండ్లు గడిపిన శంకరానికి ఆ గ్రామం మీద అభిమానం కాబోలు. అనుకుంది, అతను పదే పదే వూరికి వెళ్తానంటుండటం వలన.

సౌభాగ్యమ్మ, రఘు గట్టిగా చెప్పటంతో వాళ్ళ మాటకి ఎదురు చెప్పలేక వుండిపోయాడు శంకరం.

ఆ వేళ సాయంత్రం ఆఫీసునుంచీ రాగానే శంకరాన్ని పిలుచుకుని పార్కుకు వెళ్ళింది రేణుక. పల్లెటూరి కబుర్లు, తమ చిన్ననాటి ముచ్చట్లు మాట్లాడుకుంటూ పచ్చికలో కూర్చున్నారు ఇద్దరూ. ఇంతలో వేణుమాధవ్ వచ్చాడు. శంకరానికి, రేణుకకూ విష్‌చేసి అతనూ కూర్చున్నాడు.

"ఈ మధ్య ఇతర కార్యక్రమాల్లో పడి మన రెగ్యులర్ ప్రోగ్రామ్ దెబ్బ తింది." అన్నాడు వేణుమాధవ్.

ఆ ప్రోగ్రాం ఏమిటో అర్థం కాలేదు శంకరానికి. అతని మనస్సులో అనేక రకాల ఆలోచనలు అల్లిబిల్లిగా అల్లుకో సాగేయి.

"మాధవ్‌గారు ఒక చక్కని కథ చెప్తున్నారు బావా రోజూనూ. చాలా యింటరెస్టింగ్‌గా వుంటుంది. ఈమధ్య పది పదిహేను రోజుల్నుంచీ మాత్రం సాగటంలేదు" అంది రేణుక, శంకరంతో.

"అందుకనే ఇవ్వాళ తీరికచేసుకుని వచ్చాను. చెప్పమంటారామరి," అని అడిగేడు వేణుమాధవ్.

"చెప్పండి" అంది రేణుక.

శంకరం ఇబ్బందిగా మసిలేడు. వేణుమాధవ్ మొదలెట్టాడు.

"కాంతం జీవితమంతా అలా దుఃఖమయంగానే గడిచింది. పెద్ద చదువులు చదివి గొప్పవాడు కావాలనే ఆశతో ఇంట్లోడబ్బు తీసుకుని పారిపోయిన కాంతం, తన ఆశను, ఆశయాన్ని సాధించలేకనేపోయాడు. తనక్లాస్‌మేట్ సుజాతని వివాహమాడి, ఆ పదివేలతో మూడుపూవులు ఆరుకాయలుగా రెండేళ్లు గడిపాడు.

సుజాత పోతూ పోతూ ఒక బాబును అతనికిచ్చి కాలంచేసింది.

.... ఇంతవరకూ అతను నాకు చెప్పిన కథ.

"కాంతంతో నా పరిచయం విచిత్ర పరిస్థితుల్లో జరిగింది "

"ఆ వే ళ....

"....హాస్పటల్ బిల్డింగ్స్ పని చేయటానికి వెళ్ళాను నేను. మూడవ అంతస్థుకు రూఫ్‌శ్లాబ్‌కు గ్రిల్ తయారు చేస్తుంటే పరీక్షిస్తున్నాను నేను. అక్కడ్నుంచీ నా కగుపించిన దృశ్యం నన్ను కదలించి వేసింది."

"పంపు నీ ళ్ళ తో పసిపిల్లవాడికి నీళ్ళుపట్టి తనూ త్రాగివచ్చి, కంట్రాక్టర్ని ఏదో ప్రా ధే య ప డ సా గా డు కాంతం. అతని కళ్ళల్లో దైన్యం, అసహాయత చూసికూడా కఠినంగా మాట్లాడుతున్నాడు ఆ కంట్రాక్టరు కొద్దిసేప

---

★ ఒక లాయరు అవతలి పార్టీ లాయరుతో :- "ఆ చెట్టుక్రింద కూచ్చున్న వాళ్ళంతా మీ సాక్షులేనా ?"

రెండో లాయరు :- "అవును."

మొదటి లాయరు :- "అయితే ఈ కేసు మీరు గెలుస్తారు. ఇదివరకు రెండు సార్లు వాళ్ళను పెట్టుకునే నేను గెలిచాను."

టికి దీనంగా, భారంగా వెళ్ళిపోబో యాడు కాంతం.

"నా హృదయం ద్రవించిపోయింది. పిల్చాను. విషయమేమిటో కనుక్కొ న్నాను. ఉద్యోగం కోసం తిప్పలు పడుతున్నట్లు చెప్పాడు.

"కాంతాన్ని నా దగ్గరే వుండమ న్నాను. అతనూ బి.ఇ. చదవాలని ప్రయ త్నించినవాడే. మొదటి సంవత్సరం గెంటాడుకూడా. నేనతనికి నా వుద్యోగ ధర్మాన్ని గురించి వివరించి ప్లాన్‌లు గీయటం, ఎస్టిమేట్స్ తయారుచేయటం నేర్పాను ఇద్దరు ఒంటరిగాళ్ళమధ్య పసిపిల్లవాడి రక్షణ కష్టమని బాబును నాకు తెలిసిన ఒక ఆయాకు వప్ప చెప్పాను.

"కాంతం ఆల్‌మోస్ట్ నాకు పర్సనల్ సెక్రటరీ అయ్యాడు. ఇలా వుండగా ఒకనాడు...."

"రేణుక ఉత్సుకతతో ముందుకు జరి గింది. వేణుమాధవ్ కళ్ళల్లోకి చూస్తూ."

"శంకరం ఆమె వైపు అదోలా చూశాడు."

వేణుమాధవ్ ఒక్క క్షణం ఆగి, వాళ్ళిద్దరినీ పరికించి చెప్పసాగేడు. "మేం యిద్దరం ఒక పల్లెటూరికి క్యాంప్‌కి వెళ్ళాం. జీప్ మట్టిరోడ్డుమీదపోతోంది. పీ రెండ కాస్తున్న సాయంత్రం వాతా వరణం అహ్లాదకరంగానే వుంది. ఊళ్ళోకి ప్రవేశించబోతూ వుండగా జరిగింది ఆ దుర్ఘటన.

"వెదురు గడలతో నిండిన ఎడ్ల బండి రోడ్డు మలుపులో ఆగి వుంది. హారన్‌కొట్టి జీప్‌ను ముందుకు పోనిచ్చాడు డ్రైవర్. బండివాడు కారు వస్తున్నదనే ఆతృతతో ఎడ్లను అదిలించాడో ఏమో బండి ప్రక్కకు తిరగటం, చువ్వల్లాంటి రెండు వెదురు గడలు బలంగా కాంతం కళ్ళల్లో దిగబడిపోవటం చిటికలో జరిగిపోయినై."

వేణుమాధవ్‌కు కళ్ళనీరు తిరిగింది. కంఠం గద్గదమైంది. మాట్లాడలేక పోయాడు.

రేణుకకు హృదయాన్ని పట్టి లాగినట్లయింది.

శంకరం దీర్ఘంగా నిట్టూర్చాడు.

క్షణాలు గడిచినై.

"ఒక మిత్రుడి సలహా కాంతాన్ని దొంగను చేస్తే మరో మిత్రుడి సాహచర్యం అతన్ని అంధుణ్ణి చేసింది...." వేణుమాధవ్ చెప్పసాగేడు. "కాంతం కళ్ళురావటానికి చేయని ప్రయత్నం లేదు. వెయ్యని మందు లేదు. అతను లాగే వుండిపోయాడు అప్పట్నుంచీ. ఆ తర్వాత మురళిని సాధన చేశాడు. మురళి పాటలో అనన్య సామాన్యమైన ప్రతిభను గడించాడు."

"అలాగా" ఉత్సాహంగా అన్నది రేణుక. ఇవాళ "వారిని చూడాల్సిందే".

"మీ యిష్టం" అన్నాడు వేణుమాధవ్."

రేణుక లేచింది. "వెళ్దామండీ" అని

శంకరాన్నుద్దేశించి "ఏంబావా.వారిని చూసివద్దామా"అన్నది.

శంకరం ఆమెవైపు తీక్షణంగా చూసి "అదోలా అన్నాడు" పద అని.

కాంతాన్నిచూసి అతనిమురళీపాటని విన్న రేణుకకు అతనలా అంధుడుగా వుంటం ఎంతోబాధ కలిగించింది.

"ఏమైనాసరే, మీరువీరికి కళ్లువచ్చేటట్లుచేయాలి. ఆఁ నాకో ఆలోచన కలిగింది."

వేణు మాధవ్ అడిగాడు "ఏఁవిటది?"

"మా అన్నయ్యకు చూపిస్తే .... అవసరమైతే ఆపరేషన్ చేస్తాడు."

వేణు మాధవ్ పేలవంగా నవ్వేడు. "అలాంటి ప్రయత్నాలన్నీ విఫలమైన తర్వాతే చేతులు ముడుచుకు కూర్చున్నాము"

"ఆ మాటంటే ఒప్పుకోను నేను. ఎవరో కొందరికి అసాధ్యమైన పని అందరికి అసాధ్యమే అని ఎందుకనుకోవాలి"?

"సరే వెండి చూద్దాం" అన్నాడు వేణు మాధవ్. ఆమెతో వాదించ దలచుకోక.

శంకరం ఇబ్బందిగా ముళ్లమీద కూర్చున్నట్లు కూర్చోటం గమనించిన రేణుక "వెళ్దామా" అంటూ బయలుదేరింది.

ఆ రోజు రాత్రి ....

కాంతం దుస్థితిని తలచుకుని హృదయం బరువెక్కింది రేణుకకు. రేణుక ప్రవర్తన అదోలా తోచి మనసు కలత చెందింది శంకరానికి.

ఏమైతేనేం, ఆరాత్రి యిద్దరికీ నిద్ర పట్టలేదు.

# 5

రఘూ మనసు మనసులో లేదు. మెత్తటి ప్రక్కమీద పడుకున్నాడన్నమాటేగాని, అతనికి ముళ్ళమీద పడుకున్నట్లే వుంది. నిద్ర లేమివల్ల కళ్ళు వాచి మంటలు పుడుతున్నాయి.

---

★ "సర్వర్‌తో ఒకడు :— "ఏమిటయ్యా? ఈ ఇడ్లీలు రోజురోజుకి చిక్కి శల్యమై పోతున్నాయి?"

సర్వరు :— అబ్బే. మీకు వూరికే అలా అనిపిస్తోంది. హోటలు ఈ మధ్య పెద్దదై పోతోంది కదండీ, అందుకని ఇడ్లీలు చిన్నవైనట్టుగా కనిపిస్తున్నాయి. అంతే."

కళ్ళు మూసినా తెరచినా ఆ భీతావహ దృశ్యాలు. భయానక వాతావరణమే ఎదుట పొడగట్టి ఆందోళిత మనస్కుణ్ణి చేస్తున్నాయి. తను కన్నారా, చెవులారా విన్న దారుణాలను మననం చేసుకుని కుత కుతలాడి పోతోంది మనస్సు. ఒకరుకాదు, యిద్దరుకాదు - వందలు - వేలు - బీదా బిక్కీ నిరాశ్రయులై అలమటించి పోతున్నారు. నిప్పుతో చెలగాటమంటే ఇదేకాబోలు. క్షణంలో పచ్చని తోరణాలు కట్టిన వాకిళ్ళు, ఏనాడో పెద్దలు కట్టిన లోగిళ్ళు బుగ్గి పాలై పోయాయి. కన్నుల పండువుగా కళకళ లాడుతున్న ప్రదేశమంతా ఊసరక్షేత్రంలా మారిపోయింది.

ఆ ప్రదేశానికి ఎందరు ఎన్ని విధాల సాయపడితే పూర్వపు శోభ కలుగుతుంది. తమ కళ్ళెదుట సర్వస్వమూ అగ్నికి ఆహుతై పోతుంటే దీనంగా విలపించేవారు, పిల్లలకోసం అలమటించే తల్లిదండ్రులు, తల్లిదండ్రులకై వెదకే పిల్లలు - ఎటుచూసినా హృదయాన్ని కలచివేసే బీభత్సం.

తన చేతనైన సహాయానికి తనూ పూనుకున్నాడు. డాక్టరుగా తన కర్తవ్యాన్ని నిర్వహించటం కోసం అహోరాత్రులు అగ్ని ప్రమాదాలు జరిగిన చోట్లకు తిరిగి ఎందరికో చికిత్స చేశాడు. వాటిలో కొన్ని ప్రథమ చికిత్సలు, కొన్ని 'సీరియస్' కేసులు.

రఘూ లేచికూర్చున్నాడు. ఎటన్నా వెళ్తే బాగుండుననిపించిందతనికి. ఎక్కడికి పోయేటట్లు? భయాందోళనలతో రగిలిపోయే ప్రజలకు అండదండగా ధైర్య సాహసాలు కల యువకులు రాత్రిళ్ళు వీధుల్లో పహరా కాస్తున్నారు. దారిన పోయే ఏ వ్యక్తి అయినా ఆగి వాళ్ళకి తన 'చరిత్ర' చెప్పుకుపోవలసిందే. నగరమంతా ఇంతటి సంక్షోభంతో అల్లల్లాడి పోతుంటే, తనెక్కడికి పోగలడు, ఏం చేయగలడు?—

ఆలాగని ఇంట్లోనూ నిలవలేక పోతున్నాడు. హృదయంలో ఆవేదన, మనస్సులో ఈ బాధితుల కెలా సహాయపడటమా అనే ఆలోచన, బాధతో రగిలిపోతున్నది ఎద....

గదిలో జీరోవాట్ బల్బు గ్రుడ్డిగా వెలుగుతోంది. టేబుల్ మీద అలారం టైంపీస్ టిక్ టిక్ మని శబ్దం చేస్తూ తన రెండు చేతులూ సాచి కాలాన్ని కొలుస్తున్నది. రఘూ అలారంవైపు చూశాడు. పన్నెండూ యిరవై. ఎప్పటికి తెల్లవారేటట్టు అనిపించి దీర్ఘంగా నిట్టూర్చి పక్కమీద వాలాడు.

ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగింది. లేచి లైట్ వేసి, తలుపుతీసుకుని క్రిందికి దిగాడు రఘూ. మెర్క్యురీ ట్యూబ్ లైట్ కాంతితో హాలంతా వెలిగి పోతోంది. మెట్ల కెదురుగా అమ్మా, లక్ష్మి!-

రఘూ ఆశ్చర్యపోయాడు. ఆత్రతగా అడిగాడు, "ఏం లక్ష్మి ఎలా వుంది?"

"మా నాన్న ఆలాగే వున్నాడండి: వాసు మాత్రం పెడబొబ్బలు పెడుతున్నాడు, "మంటో, మంటో" అని

ఒకటే ఏడుపు. అది ... బాధతో గిలగిల లాడిపోతుంటే యిక చూడ లేక ధైర్యంచేసి మీదగ్గరికి పరుగెత్తు కొచ్చాను." లక్ష్మి చెప్పగానే లోప లికిపోయి మెడిసన్ ఛెస్టు తీసుకుని బయల్దేరాడు రఘూ.

"ఇటు తెండి నే పట్టుకొస్తాను." అంది లక్ష్మి. బ్యాగ్ ఆమె చేతికిచ్చి ముందుకు సాగాడు రఘూ.

"మీకు నిద్రాభంగమైనట్లుంది." లక్ష్మి బాధగా అడిగింది.

"నిద్రనేది పడితేగదా ?"

"నిజమా ?" అన్నట్లు అతనివైపు ఆశ్చర్యంగా చూసింది. రఘూ మనసును అర్థం చేసుకోగలిగిన లక్ష్మి అతని మంచితనానికి లోలోపలే కృతజ్ఞత చెప్పుకుంది.

"వస్తానండీ" అని సౌభాగ్యమ్మకు చెప్పి కదిలింది లక్ష్మి.

రెండు నిముషాల్లో యిద్దరూ ఆ ప్రదేశానికొచ్చారు. రఘూ ఆ భవంతి దగ్గరకొచ్చే సరికి అక్కడున్న వారంతా లేచి నిలబడి అతని వైపు మూగచూపులతో చూడసాగేరు.

ఆ భవనమంతా రఘూ హాస్పిటల్లో ఓ భాగం మాత్రమే. "ఇన్ పేషంట్ వార్డ్"లో ఈ భాగాన్ని అగ్ని ప్రమాదంలో ప్రమాదానికి లోనైన వాళ్ళకి కేటాయించి ఉచిత వైద్య సహాయం చేస్తున్నాడు రఘూ.

రఘూ వాసు బెడ్ దగ్గరి కొచ్చాడు. వాసు చేతులూ కాళ్ళూ కొట్టుకుంటూ "మంటో, మంటో" అని పెడబొబ్బలు పెడుతున్నాడు. ఎటో పరుగెత్తాలని ప్రయత్నిస్తున్నాడు. కాని అతన్ని జాగ్రత్తగా పట్టుకుని. పడుకోమని ఓదార్చ చూస్తున్నాడో వ్యక్తి.

రఘూకు ఆ దృశ్యం చూసేసరికి కడుపులో దేవినట్లయింది. వాసును పడుకోబెట్టిన అరటి ఆకులు అప్పటికే కమిలి పోయినై. బ్యాగ్ తెరచి రెండు మాత్రలు తీసి వాసుకిచ్చాడు. లక్ష్మి గ్రుడ్లురిమినా, కసిరినా, బుజ్జగించినా వినలేదు వాడు. చివరికి రఘూ "అవి వేసుకుంటావా సరేసరి, హాయిగా నిద్ర పోవచ్చు. లేదా యిలాగే ఏడుస్తూ వుండు." అని చిరాగ్గా లేచేసరికి, వాడు బిక్కు బిక్కు మంటూ అక్కనూ, రఘూనూ చూసి గప్ చుప్‌గా మ్రింగే

---

★ హోటల్లో ఒకడు సర్వర్‌కుర్రాణ్ణి పిలిచి :— "నేను పెసరట్టు చెప్పింది నీకేనా ?"

"అవునండి."

"అలాగా ? ఎలా వున్నారు నీ మనమలు, మనవరాళ్ళు ?

శాడు. మరికొద్ది క్షణాలకే వాసు నిద్ర పోయాడు.

కృతజ్ఞతా పూర్వకంగా రఘూవైపు చూచింది లక్ష్మి

రఘూ ఇంటికి వెళ్ళబోయేసరికి అక్కడున్న వాళ్ళలో మరికొందరు అతనితో తమ బాధల్ని వెళ్ళబుచ్చుకున్నారు. రఘూ వాళ్ళందరికీ పరామర్శించి, పరీక్షించి, ధైర్యం చెప్పి, ఇంటికి వచ్చేశాడు

గదిలో పడుకున్న రఘూ మనస్సులో మళ్ళీ ఆలోచనల సంక్షోభం బయల్దేరింది. అగ్నిప్రమాదంలో అన్నీ కోల్పోయి కట్టుబట్టలతో బ్రతికి బయట పడ్డ అనేక కుటుంబాల్లో చంద్రయ్యదీ ఒకటి

కానీ వీళ్ళ దురదృష్టవశాత్తు ఆ దారుణ దృశ్యాన్ని చూసిన చంద్రయ్యకు స్పృహ పోయింది అతని కొడుకు వాసు మంటల్లో చిక్కుకోవటంతో వొళ్ళంతా కాలిపోయింది. లక్ష్మి ఆయన ఏకైక పుత్రిక.

ఆ కుటుంబానికి పట్టిన దుస్థితికి జాలి కలిగింది రఘూకు.

వాసును చూడగానే అతని హృదయం ద్రవించి పోయింది దానికితోడు చంద్రయ్య స్పృహ కోల్పోవటం లక్ష్మి వొంటరిదై బెంబేలుపడటం చూసి తానెంతగానో వగచాడు. హృదయ విదారకంగా విలపించే ఆమెకు ఎంతగానో ధైర్యం చెప్పి తన హాస్పిటల్‌కు తీసుకొచ్చాడు.

చంద్రయ్యకు, వాసుకు చికిత్సచేసిన తర్వాత లక్ష్మి ఆమె గోడును చెప్పుకుంది. ఆమె చెప్పిన విషయాలను మననం చేసుకోసాగిందాతని మనస్సు.

చంద్రయ్య బ్రతికి చెడిన వ్యక్తి. అతనికి పెద్దగా చదువురాదు. అలాగని అసలు విద్యాగంధం లేనివాడూ కాదు. ఏదో నాలాకాలంప్పు చదువు చదువుకున్న వాడైనా గొప్పగా బ్రతికాడట. ప్రస్తుతం ఓ పొగాకు కొట్టు పెట్టుకుని జీవయాత్ర సాగిస్తున్నాడు. అతని కిప్పుడు ఆ పొగాకు కొట్టే సర్వస్వం

వస్తుతః చంద్రయ్య నిత్య శంకితుడు. అతని మనస్సెప్పుడూ ఏదో ఓ కుశంకను గురించి ఆలోచించటానికే అలవాటు పడింది కొట్లో వున్నది వొకే వొక్క గుమాస్తా. చంద్రయ్య భోజనానికి వెళ్ళేటప్పుడు తప్పనిసరిగా కొట్టంతా ఆ గుమాస్తా మీద వదలిపెట్టి వెళ్ళవలసి వస్తుంది ఆ అర్థ గంటసేపూ ఎంతో బాధతో కొట్టు [illegible]దేవాడు చంద్రయ్య పోనీ. ఈ బాధ ఎందుకు ? కొట్టు తాళం వేసుకుని వెళ్ళకూడదా అనుకుంటే ఆ అర్థ గంట బేరం పోతుందనే బెంగ. గుమాస్తాను కూర్చోబెట్టి వచ్చేస్తే వున్నది

కాస్తా తీసుకుని వాడెక్కడ వుడాయిస్తా డోనసీ లేదా అమ్మిన అమ్మకంలో కొంత "కమిషన్" కొట్టాడేమోనని సందేహం చంద్రయ్యకు

ఇలా కీడును శంకించటానికి అలవాటు పడటం వల్లనే చంద్రయ్య ముందు ముందు పొగాకు ధరలు పెరుగుతాయనే అనుమానంతో యీయేడు కొన్ని బేళ్ళు ముందుగా కొని యింట్లో నింపుకున్నాడు ఊరంతా కొంపలంటుకోవటం చూసి భీతచిత్తుడై మళ్ళీ కీడెంచి ఇంట్లోవున్న పొగాకు బేళ్ళను ఎక్కడికి కన్నా చేర్చకుండామనే ఆలోచన కలిగింది కాని ఎవ్వరినీ నమ్మలేని మనస్తత్వం కావటం వల్ల ఆ పని సకాలంలో చేయలేక పోయాడు చంద్రయ్య

అంచెలంచెలుగా సాగిన అగ్నికాండ తమ పేటకు కూడా దాపురించినప్పుడు తొందరపడ్డాడు చంద్రయ్య అయితే కొంపలు భగభగమండేటప్పుడు నూతులు త్రవ్వితే ఫలితమేముంది? జరగవలసింది జరిగిపోయింది

చంద్రయ్య వొంటివిట్టాడి ఇల్లు బుగ్గిపాలు కావటానికి ఓ క్షణమే సరిపోయినా ఆ యింట్లో దాచబడిన పొగాకు బేళ్ళుమాత్రం తాపీగా తగలబడినై అసహాయుడైన చంద్రయ్య మండిపోతున్న కొంపనూ పొగాకు బేళ్ళనూ చూసి తన గుండెల్ని మండించుకున్నాడు కాని అగ్నిహోత్రుడికా జాలి?

నిశ్శబ్ద నిశిలో నింగికి ఎగసే ప్రయత్నంలో మిడిసి పడుతున్న ఆయనకి విన్నపాలు విలాపాలు వినపడలేదు చంద్రయ్యలాంటి వాళ్ళెందరో స్పృహలు పోగొట్టుకొన్నా వాసులాంటి వాళ్ళు ఎందరో వొళ్ళు తగలబెట్టుకున్నా లక్ష్మిలాంటి అభాగ్యులెందరో నిలువ నీడలేక నిస్సహాయులై పరితపించినా_తన ఆకలి తీర్చుకునే చల్లబడ్డాడు అగ్నిహోత్రుడు

రఘూ బరువెక్కిన హృదయంతో దీర్ఘంగా నిట్టూర్చాడు తను పుట్టి పెరిగిన తర్వాత యింతటి దారుణాన్ని చూసి ఎరుగడు యుద్ధ దృశ్యాల్ని పుస్తకాల్లో చదివితేనే పరితపించిపోయే తనకు ఇంతటి ఘోరాన్ని కళ్ళారా చూడటంతో తీరని మనస్తాపంగా వుంది ప్రజల్లో అన్యాయంగా ఇంతటి సంక్షోభాన్ని కల్పించిన మానవుల పైశాచిక ప్రవృత్తుల్నీ రాక్షస తత్వాలనీ గురించి ఆలోచించ సాగిందాతని మనస్సు

ఆలోచించి ఆలోచించి ఎప్పటికో నిద్ర పోయాడు రఘూ

* * *

[సశేషం]

# కోతి చేష్టలు

అనగా అనగా ఒక మయ్యి నూ తి మీద గిలక ఆ గిలకమీద తాడు ఆ తాడుకి ఒకవైపు పది పౌనుల బరువున్న రాయి కట్టిఉంది ఆ తాడుకి రెండోవైపున ఒకకోతి పట్టుకుని వేలాడుతోంది అన్నట్లు ఆ కోతి బరువుకూడా సరిగ్గా పది పౌనులే గిలకకి తరుచు నూనె వెయ్యడం చేత మెత్తగా ఘర్షణలేకుండా తిరుగుతోంది తాడు బరువు అసలు లెక్కలేదు చాలా తేలిక

ఒకచేత్తో తాడు పట్టుకుని మరో చేతితో అరిటిపండు పట్టుకుని తింటూన్న ఆ కోతికి కదలకుండా అల్లాగే వేలాడుతూ కూర్చోవడం విసుగనిపించింది అందుకని ఉన్నట్లుండి తాడు పట్టుకుని పైకి ఎగబాక సాగింది అప్పడు తాడుకి రెండోవైపున ఉన్న పదిపౌనుల రాయి ఏమవుతుంది? ఉన్నచోటనే ఉంటుందా? పైకి వెడుతుందా? కిందికి దిగుతుందా? జాగ్రత్తగా ఆలోచించి సమాధానం చెప్పాలి తొందర ఏమీ లేదు

శాస్త్రజ్ఞుల మనుకునే వాళ్ళుకూడా చాలామంది ఈ సమస్యకి సరియైన సమాధానం ఊహించలేక పోయారుట! నిజంగా ఇది అంత కష్టమైన సమస్యా? మీరు ప్రయత్నించి చూడండి

ఈ సమస్యకి సమాధానం చెప్పాలంటే విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞుడు ఇజాక్ న్యూటన్ ప్రవచించిన చలన సిద్ధాంతాలు ఉపయోగించాలి "రాకెట్టు ఎలా ఎగురుతుంది?" అన్న వ్యాసంలో ఈ సిద్ధాంతాలలో ఒకదానిని గురించి ఇదివరలో తెలుసుకున్నాం

కోతి తాడు పట్టుకుని కదలకుండా స్థిరంగా వేలాడుతున్నప్పుడు కోతి బరువు రాయి బరువుకి సరిగ్గా సమానం కనుక రాయీ కోతీ కూడా కదలకుండా ఉన్నచోటనే ఉండిపోతాయి కోతి పైకి ఎగబాకడం మొదలుపెట్టగానే "స్టేటస్ కో"కి భంగం కలిగింది పైకి ఎగబాకడానికి శక్తి కావాలి చేతులతో తాడును కిందికి లాగి తాను పైకి వెడుతుంది దీనినే శాస్త్ర పరిభాషలో చెప్పాలంటే కోతి వేగం చటుక్కున మారిందని వేగంలోని మార్పును వేగాధిక్యం (యాక్సిలరేషన్) అంటారు న్యూటన్ సిద్ధాంతం ప్రకారం తాడు కోతి బరువును నిలువబెట్టడమే కాకుండా దాని వేగాధిక్యం వలన కలిగిన విసురును కూడా భరించింది

పైకి కిందికి ప్రయాణం చేసేటప్పుడు వేగం మారితే బరువు మారడం మన కందరకూ అనుభవంలో ఉన్నదే పట్టణాలలో పెద్ద పెద్ద మేడలు ఎక్కడానికి లిఫ్టులు" ఉపయోగిస్తారు.

అందులో ఎక్కి ప్రయాణం చేసిన వారికి ఈ సంగతి బాగా తెలిసి ఉంటుంది. లిఫ్టు పైకి వెడుతున్నప్పుడు శరీరం బరువెక్కినట్లు, ఏదో బరువుగా కిందికి లాగుతున్నట్లు ఉంటుంది. లిఫ్టులో పైనుంచి కిందికి దిగుతున్నప్పుడు శరీరం తేలిక అయినట్లు అనిపిస్తుంది. లిఫ్టు ఎక్కని వారికి మరో ఉదాహరణ : పల్లెటూళ్ళల్లో అట్లతద్ది రోజులలో ఉయ్యాలలు ప్రతి వీధిలోనూ చెట్ల కొమ్మలను వేలాడుతూ




ఉంటాయి పిల్లలూ, పెద్దలూ అంతా ఉయ్యాలలు ఊగే ఉంటారు. ఊయల పైకి వెడుతున్నప్పుడు శరీరం బరువెక్కినట్లూ, కిందికి దిగేటప్పుడు తేలికైనట్లూ ఉండడం అందరికీ అనుభవమే. పైకి వెడుతున్నప్పుడు భూమ్యాకర్షణకి వ్యతిరేక దిశలో వేగం మారుతుంది. న్యూటన్ సిద్ధాంతం ప్రకారం వేగం మారిందంటే ఏదో శక్తి ఆ వస్తువుమీద పని చేస్తోందన్నమాట. ఈ వేగాధిక్యం ఎంత అధికమైతే ఆ శక్తి అంత ఎక్కువగా ఉంటుంది. ఈ శక్తి వల్లనే పైకి వెళ్ళేటప్పుడు మనకు నిత్యకృత్యంలో అలవాటైన బరువుకన్నా ఎక్కువ బరువు అనుభూతమవుతుంది. క్రిందికి దిగేటప్పుడు భూమ్యాకర్షణకి అనుకూల దిశలో ఈ శక్తి పనిచేస్తుంది. కనుక బరువు తగ్గినట్లు అనిపిస్తుంది.

సరిగ్గా ఈ కారణం చేతనే కోతి పైకి ఎగబాకినప్పుడు దాని బరువు హెచ్చుతుంది. అంటే తాడు మరింత బలంగా కోతి ఉన్నవైపు కిందికి లాగబడుతుంది. కనుక, కోతితో బాటు తాటికి రెండవ వైపున కట్టివున్న రాయి కూడా పైకే వెడుతుంది. కోతి ఆగితే రాయి ఆగుతుంది. కోతి కిందికి దిగితే రాయి కూడా కిందికే దిగుతుంది ; కోతి ఎంత వేగంగా ఏ దిశలో కదిలితే రాయి కూడా అంతే వేగంతో అదే దిశలో కదులుతుంది.

—డా॥మహీధర నళినీమోహన్

# దూర ప్రయాణం



ఈ యడవి ఎవరిదో ఎరుగుదును నేను;
ఈ సమీప గ్రామ మందుండు నతడు
తన హిమావృతవనము చూడగోరి ఇట
ఆగిపోవుదునంచు ఎంచునో యతడు ?
దరిదాపు లందొక్క ఇల్లైన లేని
వనమునకు, హిమ సరోవరమునకు నడుమ
మలిసంజవేళ, నేనాగుటకు హేతు
వేమియని నా హయము తెలతెల్లబోవు.
పొరబడితివా యంచు అడుగుటకువోలె
నా హయము కదలించు చిరుగంట రవళి,
గాలి హోరును, మంచు రాలిపడు సడియు
తక్క తక్కిన దొక్క నిశ్శబ్దశాంతి.
ఇది మనోహర వనము, నిబిడ తిమిరావృతము.
కాని, బాసాడితిని ఇట నిలువబోనంచు;
బహుదూర మరుగవలె నిదురించుటకు ముందు !
కడు దవ్వుపోవలయు నిదురించుటకు ముందు !

(నెహ్రూకు ప్రీతిదాయకమైన అమెరికన్ కవి రాబర్ట్ ఫ్రాస్ట్ పద్యం)

అనువాదం : ఆర్. హైమవతి.

# ఉత్త(రం) కథ

"పెళ్ళికాని వాళ్ళకి, పెళ్ళయి కాపురం పెట్టని వాళ్ళకి—రీసెర్చి స్కాలరు రాజారావిచ్చే సందేశ మేమిటంటే— రాబోయే భార్య గురించి ఏవేవో వెర్రి వెర్రి కలలు కంటూ, ఊహాలోకంలో విహరించక— వాస్తవానికి దగ్గరలో ఉండమని. ఈ సందేశం అతను స్వానుభవంమీద ఇచ్చినదే!

ఈ సందేశా న్నివ్వడానికి వారం రోజులుముందు అతను లాబొరేటరీలో కూర్చుని అదేపనిగా ఆలోచించసాగాడు. ఆలోచిస్తూన్నకొద్ది అతనికి తనేదో పెద్ద పొరబాటు చేశానని అనిపించసాగింది.

అక్కడున్న యాసిడ్ బాటిల్సన్నిటిలోనూ వసుంధరముఖం కనిపించినప్పటికి అతనాట్టే ఆశ్చర్యపడలేదు. బంగారంవంటి వసుంధరను కరిగించే శక్తి అక్కడున్న ఏ "యాసిడ్" కూ లేదు—పెగా తెల్లగా కన్పిస్తూన్న ఆ బాటిల్స్‌లో ఆమెముఖం కనిపించడంలో ఆశ్చర్యం లేదు. కానీ ఆకుపచ్చని "క్రోమియమ్ క్లోరైడ్" సొల్యూషన్లోంచి ఆమెముఖం కన్పిస్తోందంటే అది తనలోని లోపమే ననుకోవాలి.

రెండు గంటలవరకూ ప్రయోగాలతో కుస్తీపట్టి విఫలు డయ్యాకనే అతను కూర్చుని ఆలోచించసాగాడు— నైట్రికాసిడ్ పడి పసుపుపచ్చగా మారిన తన అరిచేతివంక చూసుకుంటూ—

అసలు తను తొందరపడి పెళ్ళిచేసుకోవడం వల్లనే ఈ నష్టాలన్నీ వచ్చాయని గ్రహించడాని కతనికెంతో సేపు పట్టలేదు.

వసుంధరతో అతనికి వివాహం నిశ్చయమై చాలాకాలమే అయింది. అయినా అప్పుడతని ఆలోచనల్లో ఆమె ఎక్కువగా మెదిలేది కాదు. అసలతనికి వివాహంమీదనే దృష్టిలేదు. థీసిస్ సబ్మిట్ చేసేదాకా పెళ్ళిచేసుకోకూడదని అతను గట్టిగానే అనుకున్నాడు.

అయితే—పెద్దకొడుకును పెళ్ళిపీటలమీద చూడాలని కోరుకునే ముసలితల్లీ, ఇంకా రెండేళ్ళుపోతే, చదువాక్షేలేని తన కూతుర్ని పెళ్ళిచేసుకోడేమోననే భయంతో కాబోయే మావగారూ అతన్ని ఉత్తరాలతో ఉక్కిరిబిక్కిరిచేసి అతనిచేత అవు ననిపించారు.

పెళ్ళయితే మాత్రం ఏమయింది— థీసెస్ సబ్మిట్ చేసేదాకా శోభనానికి ఒప్పుకోకుండా ఉంటే—చక్కగా రీసెర్చి చేసుకో వచ్చునని అనుకున్నాడతను.

---

వసుంధర

---

కానీ - తన ఊహ పూర్తిగా పొరపాటని అతని కిప్పుడర్థమయింది. ఏమహారాత్రైన వసుంధర మెడలో అతను మూడు ముళ్ళు వేశాడో గానీ — ఆ మూడు ముళ్ళలోని మాహాత్మ్యం కావచ్చు!

రాజారావు పెళ్ళయ్యాక విశాఖపట్నం వచ్చి నెలరోజులు దాటినప్పటికీ — అతను లాబొరేటరీకి సరిగా రావడం లేదనీ, వర్కు సరిగా చేయడం లేదనీ — ప్రొఫెసరుగారతన్ని సాధించసాగారు. కానీ అతను ఏంచేస్తాడు? మనస్సంతా వసుంధర మీదకే పోతోంది....

హృదయాన్ని పోగొట్టుకోవడమంటే ఏమిటో అతనికి అర్థమయింది!

రాజారావు రచయిత. అందువల్ల ఎక్కువగా ఊహల్లో తేలే అలవాటుంది. ఊహలో తేలినప్పుడల్లా అతనికి వసుంధర కనిపించి కవ్వించసాగింది — ఇదీ అతని అవస్థ! దీనికి నివారణోపాయం ఏమిటి?

అతను బుర్ర బద్దలు కొట్టుకుని ఆలోచించాడు. బుర్ర బద్దలయిందో లేదో గాని — ఆలోచన మాత్రం తట్టలేదు. అతన్ని కలుసుకోడానికి అప్పుడే లాబొరేటరీకి వచ్చిన స్నేహితుడొకడు — అతని ముఖాన్ని చూస్తూనే పడుతున్న అవస్థను గుర్తించి — "త్వరగా కాపురం పెట్టేయకూడదుటోయ్!" అన్నాడు.

"అది నేనెలా చెప్పను. మా మావగారికి తట్టాలిగానీ —" అనుకున్నాడతను, స్నేహితుడికి మాత్రం బదులుగా చిరునవ్వు నవ్వుతూ.

వసుంధరను స్మృతి పథంలోంచి తప్పించడానికని అతను ఆరోజు మ్యాట్నీకి "పెళ్ళిచేసి చూడు!" సినిమాకు వెళ్ళాడు. సినిమా చాలా సరదాగానే ఉంది అతన్ని మరిపించబోయిందిగానీ — మధ్యలో ఎన్టీరామారావుకి, జీవరలక్ష్మికి వివాహం జరగడంతో — అతనికి తన పెళ్ళిగుర్తుకొచ్చి మళ్ళీ వసుంధర గుర్తుకొచ్చేసింది.

అప్పుడే అతనికో ఆలోచన తట్టింది. తను వసుంధరకో ఉత్తరం రాస్తే —

కానీ, ఆమెతో తనకింకా ఏ విధమైన చనువూ ఏర్పడలేదు — మరి ఎలా రాస్తాడు? రాసినా అంతా ఏమనుకుంటారు?

అతని మనస్సు సందిగ్ధంలో పడింది. ఉత్తరం రాయాలని అతనికి గాఢంగా అనిపించసాగింది. కానీ జవాబు మావగారి దగ్గర్నుంచి వస్తుందేమోనని అతని భయం — "తప్పబ్బాయ్ — అలా రాయకూడదు" — అంటూ మావగారు రాస్తే —

తన అనుమానాలకి అతనికి నవ్వొచ్చింది. ముక్కూ, మొహం ఎరగని ఆడపిల్లకి ధైర్యంగా ఉత్తరాలు రాసే యువకులున్న ఈ రోజుల్లో, తను — స్వయంగా తాళికట్టిన భార్యకు ఉత్తరం

రాయడానికి ఎంతగానో ఆలోచిస్తున్నాడంటే హాస్యాస్పదంగా ఉండదూ?

కానీ - వసుంధర అట్టే చదువుకోలేదు. తను ఉత్తరం రాస్తే అర్థం చేసుకుని, జవాబిచ్చే తెలివితేటలు ఆమెకున్నాయా? లేక - నలుగురూ నవ్వితే- అభిమానపడి ఏడుస్తుందా?

సినిమానుంచి బయటకు వచ్చి కాఫీ హోటలుకు వెళ్ళిన అతను అక్కడ కన్పించిన స్నేహితుని ముందు ఇదే సందేహాన్ని వెలిబుచ్చాడు. ఆ స్నేహితుడు ఫక్కున నవ్వేశాడు.

"చాలా పూర్వకాలంవాడిలా ఉన్నావోయ్ నువ్వు-భార్యకు ఉత్తరం రాయడానికి ఇంత ఆలోచనా? అసలు—శోభనం ముందు రాసుకున్న ఉత్తరాలు ఎంత అహ్లాదకరంగా ఉంటాయో తెలుసా? అనుభవంమీద చెబుతున్నాను —రాసిచూడు ఒకసారి తెలుస్తుంది మజా!"

రాజారావు అనుమానంగా అన్నాడు
మరి జవాబు వస్తుందంటావా?"

ఆ స్నేహితుడు మళ్ళీనవ్వి అన్నాడు "నా అనుభవం చెప్పనా మరి - మా ఆవిడనాకు జవాబిస్తూ "మీరు ఉత్తరం రాయకపోతే మరో రెండ్రోజులు చూసి నే నే రాద్దామనుకుంటున్నాను!" అని రాసింది. ఆడవాళ్ళకీ, మనకీ ఈ ఊహల్లో మాత్రం ఏం తేడా లేదంటే నమ్ము!"

రాజారావు కీమాట లుత్సాహాన్ని కలిగించాయి. ఏమైనాసరే భార్యకు ఉత్తరం రాయాలని నిర్ణయించుకున్నాడు. ఎప్పుడైతే ఉత్తరం రాయాలీ అని నిర్ణయించుకున్నాడో వెంటనే అతనికో ధర్మసందేహం వచ్చింది - ఏమని రాయాలీ అని.

అసలు భర్త భార్యకు ఉత్తరంలో ఏం రాస్తాడు? ఈ విషయం ఒకళ్ళనడిగేది కాదు. అయినా అతను అడిగీ అడుగనట్లుగా ఆ స్నేహితుణ్ణి అడిగాడు - "ఏమిటో పేజీలు పేజీలు ఉత్తరాలు రాసేస్తావ్ - ఏం రాస్తావేమిటోయ్ మీ ఆవిడకి "

ఆ స్నేహితుడు నవ్వి—" కథలు రాసేవాడివి- నీకు నేనేం చెప్పగలను-" అన్నాడు.

అప్పుడతనికి తను కథకుడినని గుర్తొచ్చింది. అవునుమరి- తను కథకుడే - ఊహించి తను ఇప్పటికి చాలా రాశాడు. అటువంటిది భార్య కొక ఉత్తరాన్ని ఊహించలేడూ!

కానీ, తను రాసిన ఉత్తరానికి జవాబు రావాలి. లేకపోతే తన మనస్సు గాయపడుతుంది. అందుకని తనెంతో జాగ్రత్తగా ఉత్తరాన్ని రాయాలి. కథలు రాయడానికి మూడ్ కోసమని అతను అప్పుడప్పుడు బీచికి వెడుతూండేవాడు. కాబట్టి ఇప్పుడుకూడా బీచికి వెడితే మంచిదని అతని కనిపించింది. వెంటనే బీచికి బయల్దేరాడు.

బీచి దగ్గర అతనికి భాస్కర్రావనే స్నేహితుడు కనిపించారు.



"హలో! ఏమిటి విశేషాలు!" రాజారావు పలకరించాడు.

"ముందు నాకు కంగ్రాచ్యులేషన్సు చెప్పాలి!"

"ఎందుకు?"

"నా మొదటి ఉత్తరానికి మా ఆవిడ దగ్గర్నుంచి సమాధానం వచ్చింది—"

ఎందుకనో రాజారావు ముఖం మాడిపోయింది. "కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు నెమ్మదిగా. ఎందుకో తనకు అసూయ కలిగిందని అతను గ్రహించాడు. భాస్కర్రావు భార్య భాస్కర్రావుకి ఉత్తరం రాస్తే - తనకు అసూయ ఎందుకు? తను ఉత్తరం రాస్తే తన భార్య మాత్రం జవాబు రాయదు కనుకనా?

వెంటనే అతనికి చక్కని ఊహ తట్టింది. ఎలా రాస్తే భార్యవద్దనుంచి ఉత్తరం వస్తుందో - అర్థమయిందని పించింది. అన్యమనస్కంగానే భాస్కర్రావుతో సంభాషణ ముగించి బీచి నుంచి తొందరగా రూమ్ చేరుకున్నాడు.

అప్పటికి క్యారియర్ వచ్చి రెడీగా ఉంది. రూమ్మేట్ లక్ష్మీనారాయణ అతనికోసమే ఎదురు చూస్తూండడం వల్ల, రాగానే రాజారావుని పలకరించబోయాడు. "ఉత్తరం రాసోక్కవాలి: నన్ను మాట్లాడించకండి!" అని సీరియస్గా ఓ తెల్లకాగితాన్ని తీసి కుర్చీలో కూర్చుని, జేబులోంచి పెన్నుతీసి విడిపాడు. పెన్నులో సిరా ఉంది.

ఏదయినా మంచిపని చేద్దామనుకున్నప్పుడు దానికన్ని విఘ్నాలే జరుగుతాయని కథకుడిగా నమ్మే రాజారావు పెన్నులో సిరా ఉండిఉండదని అనుకున్నాడు. కానీ, పెన్నులో సిరా

ఉండడంతో, తను చేస్తున్నది మంచి పనికాదేమోనని ఒక లిప్తకాలం అత నికి అనిపించింది. అయినా, అతను నిరుత్సాహపడకుండా రాయడం మొదలుపెట్టాడు.

రాసేముందే అతను అనుకున్నాడు. సంబోధన చాలా సింపుల్‌గా, సహజంగా ఉండాలని. ఏదో సినిమాల లోలా, కృత్రిమంగా హృదయ రాణీ, ఆరాధ్య దేవత అంటూ వ్రాయకూడదు.

ఉత్తరం రాయడం మొదలుపెట్టా డతను.

"ప్రియమైన చి॥ సౌ॥ వసుంధరను రాజారావు దీవించి వ్రాయునది—

నీవు థర్డ్ ఫారం ప్యాసయినట్లు మీ నాన్నగారు రాసిన ఉత్తరంవల్ల తెలుసుకుని చాలా సంతోషించాను. ముందు ముందుకూడా బాగా చదివి అలానే ప్యాసవుతావని ఆశిస్తున్నాను.

నీవు చదువుకోలేదనీ, అందువల్ల నేను ఉత్తరం రాస్తే జవాబివ్వవనీ నా స్నేహితులు నన్నేడిపించడం మొదలుపెట్టారు. వాళ్ళు నిన్నలా తక్కువ చేస్తూంటే చూడలేక, చదువు కోకపోయినా నా భార్య తెలివితేటలకేం తక్కువకాదు; నేను ఉత్తరం రాయక పోనీ - రాస్తే వెంటనే సమాధానం ఇస్తుందని పందెం కట్టాను. ఆ పందెంలో వాళ్ళని గెలిపిస్తావో, నన్నే గెలిపిస్తావో నీదే భారం!

నేను తొందరగా ఈ పెర్చి పూర్తిచేసు కుని ఉద్యోగంలో ప్రవేశిద్దామనుకుం టున్నాను. ఆ తొందర ఎందుకను కుంటున్నావు — నీ కోసమే!

మొన్న పెళ్ళిచేసిచూడు పిక్చరు చూశాను. సినిమా చాలా బాగుంది — అందులో ఒక పెళ్ళి జరుగుతూంటే మన పెళ్ళి గుర్తుకొచ్చింది. వెంటనే నీవూ, అమాయకమైన నీ ముఖం గుర్తుకొచ్చాయి. మనసంతా అదోలా అయిపోయి వెంటనే నీకు ఉత్తరం రాయాలనిపించింది. ఒక విధంగా ఉత్తరం రాయడానికి ఇదీ కారణమే!

నాలుగేళ్ళక్రితం పెళ్ళి చూపులకని నేను వచ్చినప్పుడు — పెళ్ళని విన్న నలుగురూ వేళాకోళం చేస్తున్నారని ఏడుస్తూకూర్చున్నావు. అప్పుడు విన్న నేనలాగే చూడవలసి వచ్చింది. ఇప్పుడు నేను ఉత్తరం రాశానని నలు గురూ వేళాకోళం చేస్తే ఏడుస్తూ కూర్చుంటావేమోనని భయంగా ఉంది. నీవలాంటిదాని వయితేమాత్రం నాకు జీవితమంతా ఏడుపే అవుతుంది. కాని నీవలాటి దానివని అనుకోను. నీవు నా బంగారు వసుంధరవు - అవునా?

మన పెళ్ళి ఫొటోలు-మా ఊళ్ళో తీయించుకున్నవి- నాన్నగారు పంపిం చారు. చాలా బాగా వచ్చాయి. అన్నిం ట్లోనూ నువ్వే బాగున్నావు. ఒక ఫొటోలో నవ్వుతూ ఎంతోబాగాపడ్డావు. ఆ ఫొటోలను రోజుకు పది సార్లైనా చూసుకుంటున్నానంటే నమ్ము!

ఇలా రాస్తూంటే విహంగా నీకు ఆ ఫొటోలను చూడాలనిపిస్తుందనుకుంటాను. కావాలంటే తప్పక పంపిస్తాను. కానీ ఒక్క షరతు- నీ ఫొటోలను చూస్తూ బ్రతుకుతూన్ననేను అవి లేకపోతే ఉండలేను. కాబట్టి నీ ఫొటో ఏదయినా ఉంటే పంపించు__ లేదా కనీసం ఈ ఫొటోల నయినా వెంటనే పంపించేయి! ఏసంగతీ జవాబిస్తావు కదూ!

ఇంకా ఎన్నో రాయాలని ఉంది. కానీ నీ వద్దనుంచి జవాబు రాదేమోననే అనుమానం నన్ను పీకిస్తోంది - పైగా జవాబు రాకపోతే స్నేహితుల్లో అవమానం! అన్నీ వివరంగా రాశాను. అటుపైన నీ ఇష్టం!

మీ నాన్నగారి దగ్గర్నుంచి తరచూ ఉత్తరాలు అందుతూనే ఉన్నాయి. వాటి వల్లే మీ అమ్మగారి క్షేమమూ, తమ్ముళ్ళ క్షేమమూ తెలుస్తున్నాయి.

మీ తమ్ముళ్ళు పరీక్షలు ప్యాసైనారని తెలిసి చాలా సంతోషించాను. వాళ్ళను బాగా చదువుకోమను_ పెళ్ళిలో చూసినప్పుడు నీవు చాలా బలహీనంగా ఉన్నట్లు కనిపించావు_ ఏవయినా మంచి మందులు పుచ్చుకో! ఇక్కడ క్యారియరు భోజనం చేస్తున్న నా ఆరోగ్యం సంగతి వేరే ఏమీ వ్రాయనక్కరలేదు.

ఇంతే సంగతులు. నీ జవాబుకోసం ఎదురు చూస్తుంటాను. ఏ జవాబు రాకపోతే మాత్రం ఇదే నీకు నా ఆఖరి ఉత్తరం__

రాజారావు"

ఉత్తరం రాసేసి ఓ సారి భారంగా నిట్టూర్చాడు రాజారావు. అంతసేపూ ఓపిగ్గా ఎదురు చూస్తూన్న లక్ష్మీనారాయణ_ "రాయడం అయిపోయిందిగా _మరి భోంచేద్దామా?" అన్నాడు. సరేనంటూ లేచాడు రాజారావు.

రాజారావుకి అన్నం సహించలేదు. తను రాసిన ఉత్తరమే మెదుల్తోంది మనస్సులో _ అనుకోకుండా తను రాశాడు ఉత్తరాన్ని_తప్పకుండా జవాబు రావాలి!

తొందరగా భోజనం ముగించి అతను మంచంమీద పడుకుని మళ్ళీ ఉత్తరాన్ని చదువుకోసాగాడు. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు.... తర్వాత అతనికి విసుగొచ్చింది. ఉత్తరాన్ని మడతపెట్టి కవర్లోకి పెట్టేశాడు. ఎడ్రెస్ రాస్తూ వసుంధర పేరు రాసేటప్పుడు అతని చేయి వణికింది.

మరో పావుగంటలోనే_రోజూలానే_చుట్టుపక్కల వాళ్ళంతా రాజారావు రూమ్ చేరుకున్నారు_హస్కు ప్రారంభించడానికి. మధ్యలో రాజారావు తను ఉత్తరం రాసినట్లుగా ప్రకటించాడు. స్నేహితులతన్ని అభినందించారు. అనుమానిస్తూన్న అతనికి_ తప్పక జవాబు వస్తుందని అభయమిచ్చేరు కూడా. ఆ సందర్భంలోనే_

ఉత్తరమే గనుకవస్తే పార్టీ ఇస్తానని స్నేహితులకు వాగ్దాన మిచ్చాడు.

రాజారావు నవ్వుకున్నాడు. ఉత్తరం వస్తుందని మిత్రులు చెబుతూంటే - రాదని వాదిస్తున్నది తను। కానీ తను వసుంధరకు వ్యతిరేకంగా రాశాడు. అంటే జవాబుకోసం తను అబద్ధం రాశాడు.

ఆలోచనల్లో ఉన్న రాజారావు ఆ రాత్రి సంభాషణలో అట్టే పాల్గొన లేకపోయాడు. కనీసం అతనికి నిద్ర వచ్చినా బాగుండేది. అదీ రాలేదు. కలత నిద్రలో - మధ్యమధ్య వసుంధరను గురించి కలలుకంటూ ఆ రాత్రి గడిపేశా డతను.

మర్నా డుదయం పెందరాళే లేచి కాలకృత్యాలు తీర్చుకుని, టంచనుగా టైముకి పోస్టు బాక్సులో పడేశాడు ఉత్తరాన్ని.

ఆ రోజల్లా కూడా క్షణమొక యుగంలా గడిచింది రాజారావుకి - తను పొరబాటు చేశాడేమో, ఉత్తరం రాయకూడదేమో, రాసి వసుంధరకీ - మావగారికీ లోకువై పోతాడేమో, అసలు జవాబే రాదేమో....ఇవే ఆలోచనలు అతన్ని ఆ రోజల్లా వేధించాయి.

ఓ కధ చదువుతూ, కాలచక్రం వేగంగా పరుగెడుతోందని ఎలా అన గలిగారు చెప్మా అనుకున్నాడు రాజారావు. అసలు కాలచక్రం పరుగెట్టడం మాట దేవుడెరుగును - ఆగిపోకుండా కదిలితే చాలు ననుకున్నా డతను - ఆ రోజు ఎప్పటికీ గడవకపోవడంవల్ల విసుగొచ్చి.

ఏమైనా కాలచక్రం ఆగిపోలేదు. ఆ రోజు గడిచింది. మరో రోజు గడిచేప్పటికి అతను కొంచెం వాస్తవికం లోకి వచ్చాడు. వస్తే ఈ పాటికి ఉత్తరం వచ్చేయాలి. అక్కణ్ణించి ఉత్తరం రావడానికి ఒక రోజు మించదు. ఎలాగూ తనకు ఉత్తరం రాదు. దానికోసం ఎదురుచూడ్డం కూడా ఎందుకు ?

అతని అనుమానాన్ని బలపరుస్తూ మరో రెండు రోజులుకూడా ఉత్తరం రాలేదు.

కానీ, అతను ఉత్తరం రాసిననాటికి అయిదో రోజున ఉదయం - రాజారావు ఇంకా మంచంమీంచి లేవ కుండానే, ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవరు వచ్చింది. ఎక్కడినుంచో అనుకుంటూ కవరు చింపి ఉత్తరం లాగేసరికి వసుంధర సంతకం కనిపించింది. రాజారావు నిద్రమత్తు వదిలిపోయింది.

అప్పు డతనికి కలిగిన ఆనందం అనుభవైకవేద్యమేకానీ, మాటల్లో చెప్పడం కష్టం. చాలాసేపటివరకూ అతను ఆ ఉత్తరాన్ని చదవలేక పోయాడు.

కొంతసేపు గడిచేక అతను ఆనందపు అఘాతాన్నుంచి తేరుకుని ఉత్తరాన్ని చదువుకోసాగాడు.



"ప్రియమైన మీకు

నమస్కరించి వ్రాయ
నది ఇక్కడ అం
క్షేమం. మీ క్షేమం
వ్రాసిన ఉత్తర
అందింది నేను ఎప్పుడు
ఎవ్వరికి అసలు ఉ
రము వ్రాయుట అలవా
లేదు నాకు ఎప్పుడై
ఉత్తరము వ్రాయ
సంభవించిన యెడ
ఎక్స్‌ప్రెస్ డెలివ
వ్రాయవలెను ఎం
చేతనంచే మా

ఉత్తరములు సరిగా ఇచ్చుట లేదు అయినా స్కూలు తెరిచి చదువులో పడితే తీరుబడి ఉండదు నేను స్కూలు ఫైనల్ దాకా చదవాలని ఆశగా ఉన్నది మీ స్నేహితులతో పంతాలు పడి రాసినారు కనుక వెంటనే జవాబుఇస్తున్నాను నాకోసమని కంగారు పడి ఉద్యోగము కోసము ప్రయత్నించవద్దు ఒక మాటు మన పెళ్ళి ఫొటోలు పంపితే అందరికీ చూపిస్తాను ఆషాఢపట్టి తీసుకుని మా నాన్నగారు వచ్చేదరు మీరు కథలు వ్రాసినట్లు వ్రాయవద్దు నవ్వు వస్తోంది శ్రావణ మాసంలో నోము నోచుకుంటాను మా అన్నయ్య వడుగుకు కాపవరము వెళ్ళినాము నాలుగు రోజులుండి వచ్చినాము మా స్కూలు 20 వ తారీఖునుంచి తెరిచినారు సినిమాలు ఇంకా ఏవీ చూడలేదు చూపిన తరువాత వ్రాస్తాను పుస్తకాలు కొనుక్కున్నాను ఇంటి పేరుకూడా మార్పించినారు నేను ఇదివరకుకన్న బాగానే ఉన్నాను అయినా, డాక్టర్ని అడిగి మందులు పుచ్చుకుంటాను ఇప్పుడు మీ వంట్లో ఎలా ఉన్నది? పిల్లలందరు మర్చిపోవద్దు మీ ఆరోగ్యము జాగ్రత్త, మీ ఉత్తరము చూసి మా నాన్నగారు, మా అమ్మ చాల సంతోషించినారు. నా రాత బాగా ఉండదు నవ్వవద్దు. ఇంతే సంగతులు తప్పులున్న క్షమించవలెను ఈ ఉత్తరము అందిన వెంటనే చింపిపారవేయవలెను

ఇట్లు,

వసుంధర"

మొదటిసారి చదివినప్పు డతనికి ఉత్తరం సరిగా అర్థం కాలేదు రెండో సారి చదివినప్పుడు కొద్దిగా అర్థమయింది మూడోసారి చదివేసరికి పూర్తిగా అర్థమయింది

భార్య వద్దనుంచి వచ్చే ఉత్తరం ఎంతో మధురంగా ఉంటుందనీ – తను రాసినట్లుగానే ఆమెకూడా పెద్ద ఉత్తరం రాస్తుందనీ ఆశించాడతను కానీ ఈ ఉత్తరం అతన్ని వాస్తవిక జగత్తులోకి తీసుకొచ్చింది

ఉత్తరంలో అతన్ని బాధించిన అంశాలు చాలా ఉన్నాయి – "ఎప్పుడైనా ఉత్తరము వ్రాయడం సంతవిం నె కల" – అంటే అప్తమాను

 వ్రాయవద్దనా? ఎప్పుడూ రాస్తూండమని అడగడానికి బదులు అలా రాసిందా, తరువాత — కథలు రాసినట్లుగా రాయవద్దంది — తనెంతో కష్టపడి రెండు పేజీల్లో ఇమిడ్చిన భావాలను కథ అని వేళాకోళం చేసింది —

ప్రతి వాక్యమూ అతన్నిలాగే నిరుత్సాహ పరిచింది

మధ్యాహ్నం - ఉత్తరం వచ్చిందని తెలుసుకున్న స్నేహితు లతన్ని పార్టీ అడిగారు అతను బాధగా తనను ఉత్తరం ఎంత నిరుత్సాహపరిచి దీ చూచాయగా చెప్పాడు అప్పుడు ఆ స్నేహితుల్లో ఒకతను నవ్వాడు— "ఓస్, దీనికేనా - మా ఆవిడా ఇంచుమించు నా కలాగే రాసింది అయినా, నే నెప్పుడైనా నిరుత్సాహ పడ్డానా? భార్య రాసిన ఉత్తరాలు మధురంగా ఉంటాయని అనడం ఎందుకో తెలుసా - అవివాహితులకు మనమీద అసూయ కలిగించడానికి - తెలుసా?"

రాజారావు స్నేహితులకి పార్టీ ఇచ్చే వాడు ఆలోచిస్తూన్న కొద్దీ అసాగి నాగింగ లేకపోలే దనిపించింది వెంటనే రూమ్‌కి వచ్చి ఉత్తరాన్ని మళ్ళీ చదువుకున్నాడు, బాగుం దనిపించింది మళ్ళీ మళ్ళీ చదివినకొద్దీ ఇంకా ఇంకా బాగుం దనిపించసాగింది హఠాత్తుగా తన కలా ఎందు కనిపించడం మొదలుపెట్టిందో అతని కర్థం కాలేదు - బహుశా అవివాహితుల అసూయకు గురి కావడానికా?

ఏదిఏమైనా రాబోయే భార్య గురించి ఏవేవో ఊహించుకునే వాళ్ళకి తన ఉత్తరం కథ చెబితే - వాళ్ళకు కొంత ఉపకారం చేసినవాడి నవుతా నను కున్నాడు రాజారావు భార్య రాసిన ఉత్తరం బాగుందని తను చెప్పడం కంటే - ఎలాఉంటుందో ఆ అమాయకులకు చెబితే — వాళ్ళే ఊహించుకుంటారుగదా!

ఈ ఉద్దేశ్యంతో [illegible]అతను తన అనుభవాన్ని కాగితాలమీద కెక్కించే ఉద్దేశంతో - జేబులోంచి పెన్నుతీసి

౧౫౨



# సింహం, మనిషి

ఒక మనిషి, సింహం స్నేహితులయ్యారు వారిద్దరు ఒకనాడు దూరదేశానికి ప్రయాణం చేస్తున్నారు ఎవరి బలాన్ని గురించి వారు గొప్పలు చెప్పుకుంటూ నడుస్తున్నారు

బాటపక్కన ఒకచోట ఎత్తయిన వేదికపై శిల్పం కనిపించింది. దానిలో ఒక మనిషి ఉత్తచేతులతో సింహాన్ని గొంతుపిసికి చంపుతున్నట్టు వుంది. దాన్ని చూపించి మనిషి "చూశావా? మనుషులే బలవంతులని ఆ శిల్పం రుజువు చెయ్యడంలేదా?" అన్నాడు

"నిజమేగాని, సింహాలకు కూడా శిల్పనైపుణ్యం వుంటే, సింహమే మనిషిని సంహరిస్తున్నట్టు శిల్పం చెక్కేవి." అని సమాధానమిచ్చింది సింహం.



# కుక్క, గంట

ఒక కుక్కకి మహా పొగరుగా వుండేది ఎవర్నిపడితే వారిని వెనకపాటుగా వచ్చి కరిచేది అది వస్తోందంటే పిల్లలు, పెద్దలు కూడా హడిలిపోయేవారు

దాని వైనం చూసి యజమాని ఇక లాభంలేదని అది వస్తోందని ముందే హెచ్చరించడానికిగాను మెడలో ఒక గంట కట్టాడు అది నడుస్తుంటే గణగణ మని చప్పుడై ఎక్కడివారక్కడ తప్పుకునేవారు

ఒకనా డది బజారులో గర్వంగా గంట మోగించుకుంటూ నడుస్తోంది దాన్ని చూసి ఒక ముసలి కుక్క అంది "మెడలో గంట వుండడం నీకు ఏదో గొప్ప విషయంగా కనిపిస్తున్నట్టుంది అది నీ ఘనతకు మెచ్చి ఇచ్చిన బహుమతి కాదు: నీ నీచబుద్ధికి నిదర్శనంగా కట్టిన గంట. దాన్ని చూసి గర్వపడడంకాదు సిగ్గుపడాలి "



# బాతులు, కొంగలు

ఒక మైదానంలో బాతులు కొంగలు కలిసి తిండి ఏరుకుంటూ తిరుగుతున్నాయి ఇంతలో కొందరు వేటగాళ్ళు విల్లంబులు ధరించి ఆ సమీపానికి వచ్చారు

తేలికగా వుండే కొంగలు తుర్రున ఎగిరిపోయాయి బరువైన బాతులు ఎగరలేక అక్కడే వుండిపోయాయి వేటగాళ్ళు వాటిని సులభంగా పట్టుకుని తీసుకు పోయారు.

దేశంలో ఏదైనా సంక్షోభం వచ్చినప్పుడు ఏ బాదరబందీ లేనివారికి ఏ బాధా వుండదు. వారు తేలిగ్గా తప్పించుకుంటారు

# పిల్లి, ఎలుకలు



ఒక ఇంటిలో మందలు మందలుగా ఎలుకలు తిరుగుతుండేవి. ఈ సంగతి కనిపెట్టి ఒక పిల్లి ఆ ఇంట్లో ప్రవేశించింది. అట్టే శ్రమపడకుండానే దానికి రోజుకు పది పదిహేను ఎలుకలు దొరికేవి. ఆ రోజుకు కడుపు నిండేది.

ఇలా ప్రతి రోజూ అది సుష్టుగా ఆరగించడంతో ఎలుకల సంఖ్య క్రమంగా తగ్గిపోసాగింది. ఎలుకలు కొంచెం జాగ్రత్తపడడం మొదలుపెట్టాయి. కలుగులనుంచి బయటికి రావడం మానేశాయి. పిల్లి ఎంత జాగ్రత్తగా కాచుకుని కూర్చున్నా రోజుల తరబడి ఒక్క ఎలుకైనా పట్టుపడేది కాదు.

అప్పుడొక ఎత్తు వేసింది పిల్లి. గది మధ్యలో చచ్చిపోయినట్టు పడుకుంది. అప్పుడు ఎలుకలు మళ్ళీ తిరగడం మొదలుపెడతాయికదా, పట్టుకుని తినవచ్చు ననుకుంది.

కాని, ఎలుకలేనా తెలివితక్కువవి ? నువ్వు చచ్చినా, నిన్ను పాతిపెట్టినా, నీ తల నరికి వేళ్ళాడగట్టినా నీ దగ్గరికి మాత్రం రాము” అన్నదొక ఎలుక.

[గత సంచిక తరువాయి]



యద్దనపూడి సులోచనారాణి

"సంధ్యా !" వున్నట్టుండి వెనక నుంచి పిలుపు విన్పించింది.

కొంగుపట్టి లాగినట్టే ఆగిపోయింది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఎంత తిరిగి చూడాలనిపించినా వెనక్కి తిరగలేక పోయింది.

మాధవ్ అంటున్నాడు. "సంధ్యా ! అనారోగ్యంతో అలిసిపోయిన మనిషి యింటికి రాగానే యెంత విశ్రాంతి యివ్వాలో అంతా యిచ్చావు. ఇది నేను ఆశించలేదు. నా జన్మలో మర్చిపోలేని రోజుల్లో ఇది ఒకటి. కనీసం యీ ఒక్కపూటయినా నా మీదున్న ద్వేషం మర్చిపోయి వుదారంగా ప్రవర్తించి నందుకు, నీకు కృతజ్ఞతలు తెలుపు కోకుండా వుండలేను."

సంధ్య వెనక్కు తిరిగి చూసింది. అతను యిటువైపే తిరిగి ఉన్నాడు. ఆ ముఖంలో ఎంత నిర్వికారం ! ఎంత నిర్లిప్తత ! ఆ మాటల్లోఎంత మామూలు మర్యాద. ఉదారత్వం తను చూపించిం దిట. దానికి అతను కృతజ్ఞతలు తెలుపుకోకుండా వుండలేడుట ! ఎవరికి కావాలి ? ఎవరు అడిగారు? చల్లనిచేత్తో మృదువుగా స్పృశిస్తాడనుకున్న మనిషి హఠాత్తుగా చెయిచాచి చెంప పగుల కొడితే ఎలా వుంటుంది ? సంధ్య ముఖంలో సరిగ్గా అలాటి భావమే ప్రతి బింబించింది.

"థాంక్స్ సంధ్యా" అన్నా డతను.

సంధ్యలో రోషం దెబ్బతిన్న తాచులా ఒక్కసారి బుస్సుమని లేచింది. చెయిజాచి వేలుపెట్టి చూపిస్తూ "దీనికి - దీనికి మిమ్మల్ని భగవంతుడు కూడా క్షమించడు" అంది.

సంధ్యలో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పు చూసి తెల్లబోయాడు.

"నేనేం చేశాను ?" అన్నాడు అప్రయత్నంగా.

"ఏం చేశాను ! ఏం చేశారో తెలి యదూ ? ఇంకా ఎన్నాళ్ళీ దాగుడు మూతలు ?"

"సంధ్యా—"

"ఒక్కసారి వెనక్కి తిరిగి చూసు కోండి. ఏం చేసిందీ మీకు తెలియటం లేదూ ?"

"నువ్వనేదేమిటీ—"

"బాబు. వాడి సంగతి నా కెందుకు చెప్పలేదు ?"

"బాబా !" మాధవ్ వెనక్కి తగ్గాడు.

"అవును. వాడే. వాడి సంగతే అడుగుతున్నాను. వా డెవరో నాకెందుకు చెప్పలేదు ? చెప్పే అవసరం లేదను కున్నారా ? లేక తెలుసుకునే అర్హత నాకు లేదనుకున్నారా ?"

నిర్విణ్ణుడై చూశాడు మాధవ్.

"సిస్టర్ రాకపోతే ఏనాటికైనా మీ పెదవులు కదిలేవా ? కదిలేవి కావు. నే నెంత దౌర్భాగ్య స్థితిలో వున్నానో నాకు తెలిసేదీ కాదు."

"సిస్టరా ! ఏ సిస్టర్ !" అతని చెయ్యి అప్రయత్నంగా కిటికీ రెక్కని గట్టిగా పట్టుకుంది.

"ఏ సిస్టర్ ! ఎంతమంది తెలుసు మీకు? బాబుని పెంచి పెద్దజేసినసిస్టర్. మీరు కృతజ్ఞతతో-"

"సంధ్యా !" మాధవ్ మధ్యలోనే బిగ్గరగా అరిచాడు.

సంధ్య గుండెల్లో పొంగిన దుఃఖం కోపం, రోషం అన్ని ఒక్కసారిగా ముఖంమీదకి రావటానికి నే నంటే నే నని పోటీ పడ్డాయి.

క్షణంసేపు గదిలో భయంకరమైన నిశ్శబ్దం ఏర్పడింది.

మాధవ్ రెప్ప వాల్చకుండా అలాగే చూస్తున్నాడు.

సంధ్యకి ఏడుపు ముంచుకు వచ్చే సింది. నిలబడటానికి శక్తిలేనిదానిలా మంచం పట్టుకుని దానిమీద కూలబడు తూ "చెప్పండి. మాట్లాడరేం ? న న్నీ దౌర్భాగ్యపు స్థితిలో ఇన్నాళ్ళు ఎందుకు ఉంచారు? కేవలం వినోదంగా తమాషా చూడటానికేగా ! వాడి తల్లే వాడికి ఆయాగా వుందని తెలిసి సిస్టర్ నమ్మ లేనట్టు ఆశ్చర్యపోతుంటే -" ఎన్నాళ్ళ నుంచో గుండెల్లో నిండుకున్న దుఃఖం ఒక్కసారి గట్లు తెంచుకుని ఉధృతంగా ప్రవహించడంతో నిస్సహాయురాలైన సంధ్య ఆపైన మాట్లాడలేక చేతుల్లో ముఖం దాచుకుంది.

మాధవ్ శిలావిగ్రహంలా చలనం లేనట్టుగా నిలబడిపోయాడు.

వెక్కిళ్ళ మధ్య అస్పష్టంగా మళ్ళీ తనే అంది: "మొదటి నుంచి నన్నిలా ఎందుకు చిత్రవధ చేస్తున్నారు ? నేను మీకు ఏం అప కారం చేశానని నామీద ఇలా పగ తీర్చుకుంటున్నారు ? ఏం పాపం చేశా నని నాకీ శిక్ష ! నే నసలు ఈ బాధ తో నే క్రుంగిపోతుంటే - ఎప్పుడెప్పుడు మిమ్మల్ని చూస్తానా. ఇదంతా నిజమే నని మీ నోటినుంచికూడా విందామా అని క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూర్చుంటే, అప్పుడే ఆ శ్యామ సుందరంగారు వాళ్ళు వచ్చి—" కంఠం పూర్తిగా బొంగురుపోయి మాట పెగ లక పోవటంతో సంధ్య ఆగిపోయింది.

తర్వాత ఐదారు నిముషాల వరకూ గదిలో వింతయిన నిశ్శబ్దం ఆవరించు కుంది. కొద్దిసేపటికి ఆనిశ్శబ్దాన్ని చీల్చు కుంటూ అలలు, అలలుగా తేలివస్తున్న సంధ్యఏడుపు దిమ్మెరపోయిన మాధవ్

మనసుని తాకి చైతన్యం తెప్పించింది. అతను నిద్రలో నడుస్తున్నవాడిలా సంధ్యవైపు వచ్చాడు.

"సంధ్యా ! ఒకమాట. ఒక్కచిన్న మాట అడుగుతాను జవాబు చెప్పు బాబు ఎవరో తెలిసిన తర్వాత వాడంటే నీకు అసహ్యం కలగడంలేదు కదూ ? మనస్ఫూర్తిగా, నిస్సంకోచంగా నిజం చెప్పు." అతను ఆ అడిగే తీరు, ఆ ముఖ కవళిక చూస్తే సంధ్య నోటి నుంచి రాబోయే సమాధానం మీదనే అతని భావి జీవితం అంతా ఆధారపడ్డట్టుగా వుంది.

సంధ్య జవాబు చెప్పలేదు. ఏడుపు నిగ్రహించుకోటానికి విశ్వ ప్రయత్నం చేయ సాగింది.

"చెప్పు."

"ఏం చెప్పను. ఎలా చెప్పాలి ?" వెక్కిళ్ళ మధ్య అస్పష్టంగా అంది.

"అసహ్యం లేదు అనటానికి 'లేదు' అని ఒక్కమాట చెప్పుచాలు." చీర కొంగుతో కళ్ళు రెండూ గట్టిగా తుడుచుకుంటూ లేదన్నట్టుగా తల అడ్డంగా వూపింది.

వూపిరి బిగబట్టి ఎదురు చూస్తున్న

# జరిగిన కథ

పుణ్యానికిపోతే పాప మెదురవుతుందట. ఒకానొక భయంకర రాత్రి ఆపదలో చిక్కుకున్న సంధ్య అనే యువతికి సహాయపడబోయిన మాధవ్‌ను ఆమె అపార్థం చేసుకుని, కొట్టి అవమానిస్తుంది. ఆ తర్వాత కొన్నేళ్ళకి ఆమె అతనికి రైల్లో ఒంటరిగా తారసిల్లుతుంది. అతనిలో ఆమెపై పగ పెల్లుబికి ఆమెను మానభంగం చేస్తాడు. మరికొన్నేళ్ళకు ఆ సంధ్యే అతడు నివసిస్తున్న ఊరిలో తటస్థపడుతుంది. తన జీవితం లోకి మళ్ళీ మళ్ళీ ప్రవేశిస్తూ, తనపై విపరీతమైన ద్వేషం చూపుతున్న ఆమెను తనదిగా చేసుకోవాలని యత్నిస్తాడు. కుంటివాడైన ఆమె తమ్ముడు వాసుకు, కాలు నయంచేస్తాడు. తనవల్ల ఆమెకు జన్మించిన కుమారుడు ఎవరివద్దనో పెరుగుతున్నట్టు తెలుసుకుని వాడిని ఇంటికి తీసుకు వస్తాడు. కాని ఆ పిల్లడు తన పుత్రుడేనని సంధ్యకు తెలియదు. సంధ్య మనస్సు మార్చలేనని నిరాశచెంది మాధవ్ ఇంటిలోనుంచి వెళ్ళిపోతాడు. ఆ తర్వాత తన కాన్పు సమయంలో సహాయం చేసిన ఒక సిస్టర్ ద్వారా ఆ పిల్లవాడు తన కొడుకేనని సంధ్యకు తెలుస్తుంది. మాధవ్‌ను తానిక శాశ్వతంగా పోగొట్టుకున్నానని సంధ్య నిరాశ చెందిన సమయంలో అతడు తిరిగి వస్తాడు.

మాధవ్ ఒక్కసారిగా గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు. తృప్తిగా శ్వాస వదులుతూ "చాలు. ఇదిచాలు నాకు. ఇంతకంటే యింకేంకోరను. ఇన్నాళ్ళ నా నిరీక్షణకి యీ చిన్న బహుమతి చాలు. ఇక నేనేమయి పోయినా, ఎక్కడున్నా నాకు చింతలేదు" అన్నాడు.

"నా కోరిక నెరవేరింది. నేను కావాలనుకున్న మీ ఇద్దరూ ఒకటయారు. మీ ఇద్దరి మధ్యా అప్రతిలా ఉండకుండా, దూరంగా వెళ్ళిపోయేందుకు నాకీ నిశ్చింత, ఈ తృప్తి చాలు." తనలో తను అనుకుంటున్నట్టు అంటూ వెళ్ళిపోవటానికి వెనక్కి తిరిగాడు.

"మీ ఉద్దేశం నాకర్థమైంది. ఇన్నాళ్ళు నేను చూపిన నిర్లక్ష్యానికి, నా మూర్ఖత్వానికి ప్రతీకారం తీర్చుకోటానికి. .."

"ప్రతీకారమా? నీ మీదనా?" మాధవ్ సాశ్చర్యంగా మళ్ళీ సంధ్య వైపు తిరిగాడు. తడితో, రోషంతో మెరుస్తున్న ఆ కళ్ళని చూడగానే అతనికి మళ్ళీ హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చింది.

"ఇంకొక్క మాటకి సమాధానం చెప్పు. ఇంతక్రితం నేను రాగానే అలా చనువుగా ఎందుకు ప్రవర్తించావు? అది కేవలం నేను బ్రతికి బైట పడ్డావనే విభ్రాంతేనా లేక...." అసంపూర్తిగా ఆగిపోయాడు.

అంతవరకూ ముఖం ఎత్తి రెప్ప వాల్చకుండా అతనివైపు చూస్తున్న సంధ్య చెక్కిళ్ళు ఎర్రబడినాయి. సమాధానం చెప్పలేనట్టుగా మెల్లగా తల దించుకుంది.

"ఈ ఒక్క మాటకి జవాబు చెప్పు. ఇంక నిన్ను విసిగించను."

సంధ్య చెప్పలేదు.

"చెప్పు." బ్రతిమలాడుతున్నట్టుగా అడిగాడు.

సంధ్య మౌనం వదల్లేదు.

"చెప్పలేవా? లేక చెప్పేందుకు జవాబు అంటూ లేదా?"

సంధ్య నోటినుంచి దానికూడా సమాధానం రాలేదు.

అతని కళ్ళలో కాంతి క్రమేపి తరిగిపోయింది. ముఖం వంచుకుని కూర్చున్న సంధ్యవైపు పరిశీలనగా చూస్తూ "బహుశా జవాబేమీ లేదనుకుంటా. అంతే అయివుంటుంది" అన్నాడు.

ఆఖరిసారిగా సంశయనివృత్తి కోసం "ఒకసారి తలెత్తి నావైపు చూడు సంధ్యా! నీ నోరు చెప్పలేని మాటని నీ కళ్ళు చెప్పగలవు" అన్నాడు.

సంధ్య తలెత్త లేదు.

"చూడు. నన్ను నమ్మకంగా తెలుసుకోనీ. నువ్వెప్పుడూ పల్లెత్తుమాట అనక పోయినా నీ కళ్ళద్వారా నీ ఆంతర్యం ఎన్నోసార్లు స్పష్టంగా చదవ గలిగాను.

అవి నన్నెప్పుడూ మోసం చెయ్య లేదు."

సంధ్య తల మరింత క్రిందకు దిగిపోయింది.

"ముఖం ఎత్తు. ఒక్కసారి పైకి చూడు. ఈ ఆఖరి క్షణంలో అపార్థానికి గాని, అనుమానానికిగాని, ఆశకిగాని తావుండకూడదు. ఏదీ, నావైపు చూడు. చూడవూ?" సగం అసహనంగా, సగం బ్రతిమలాడుతున్నట్టుగా తొందర చేశాడు.

సంధ్య చివరికి అయిష్టంగానే, ఓ విధంగా బలవంతంగానే ముఖం పైకెత్తి దగ్గరగా నిలబడి ఉన్న అతని వైపు చూసింది. మాధవ్ తీక్షణంగా, లోతుగా దేనికోసమో వెతుకుతున్నట్టుగా చూశాడు. భయం, ఆనందం, అభిమానం, అనుమానం ఇంకా ఎన్నెన్నో భావాలు కలగాపులగంగా కలిసిపోయినట్టున్న అద్భుతమైన ఆ చూపు అతన్ని మెల్లమెల్లగా వశపరుచుకోసాగింది.

"సంధ్యా!" అస్పష్టంగా అతను క్షణంసేపు తడబడ్డాడు. తర్వాత తనకి తను చెప్పుకుంటున్నట్టుగా "ఇదేమిటి? నేను-నేను భ్రమపడటం లేదు గదా!" అన్నాడు.

"సంధ్య లేదన్నట్టు చూసింది. అయస్కాంతాల్లా తనవైపు ఆకర్షించుకుంటున్న ఆ సోగకళ్ళలోకి చాలాసేపు అలాగే విహ్వలుడైనట్టు చూస్తూ నిలబడిపోయాడు. తర్వాత నిలబడటానికి శక్తిలేనట్టుగా మెల్లమెల్లగా సంధ్య ముందు రెండుమోకాళ్ళమీదా కూలబడ్డాడు. తనని తనే నమ్మలేని ఆశ్చర్యం, బంగారు అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి అది గుర్తించిన సంధ్య వెంటనే రెండు చేతులూ జాపి అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది. ఆ క్షణంలో అతనికి ఆ ధైర్యం ఇవ్వటం ఆ చనువు చూపించటం అత్యవసరం అనిపించింది. ఏ కాస్త సిగ్గుపడినా, ఏమాత్రం సంకోచించినా ఈ అవకాశం వేళ్ళమధ్య నీరులా జర్రున జారిపోతుంది. అతను శాశ్వతంగా దూరమైపోతాడు. ఆ భయమే సంధ్యలో ఎల్లప్పుడూ వుండే సిగ్గుని, సంకోచాన్ని కొద్దిసేపు వెనక్కునెట్టింది.

"సంధ్యా!" అతని పెదవులు అస్పష్టం పలికాయి. ఇంకా ఇదంతా నమ్మలేనట్టు చూస్తున్న అతని కళ్ళలో ఆశా, నిరాశల్లాంటి వెలుగు నీడలు పోటీ పడ్డాయి. కొద్దిసేపు ఆ రెండింటికీ విపరీతమైన పెనుగులాట జరిగింది. చివరికి ఆశ గెలిచింది. వెలుగు నిలిచింది. మాధవ్ వెంటనే సంధ్య నడుం చుట్టూ రెండు చేతులూ పెనవేసి చప్పున ఒళ్ళో ముఖం దాచుకున్నాడు. కొద్దిసేపటివరకూ అతనేం మాట్లాడలేదు. ఏం చెప్పాలో సంధ్యకి అసలే తోచలేదు. కొన్ని రోజులనుంచి తీరని వ్యధకి గురియైన రెండు పరితప్త హృదయాలు మూగగా పెనవేసుకున్న దివ్యమైన క్షణా లవి

అతను మనసంతా సుడిగాలిలా

రేగిన భావాన్ని జాగ్రత్తగా నిగ్రహించుకుంటున్నట్టు పై పెదవిని క్రింది పెదవితో గట్టిగా నొక్కిపెట్టాడు. సంధ్యకింతవరకు అర్ధరాత్రిలో నిశ్శబ్దం ఇంత అందంగా వుంటుందనికాని, ఆ నిశ్శబ్దంలో ఏదో మనిషి సాన్నిహిత్యం అంత మధురంగా ఉంటుందనికాని తెలియదు.

సమయం గడిచింది.

ఒకటి రెండుసార్లు ఏదో చెప్పాలని ప్రయత్నించి విఫలుడయాడు అతను. అతన్ని లేవమని చెప్పాలనుకుంది సంధ్య. కాని, అతను కదిలితే ఈ మధుర స్వప్నం ఎక్కడ కరిగిపోతుందోననే భయంతో అంతలోనే విరమించుకుంది. ఆ సమయంలో అలా తన ఒళ్ళో తల పెట్టుకుని కూర్చున్న అతన్ని చూస్తుంటే స్త్రీ సహజమైన కోరికతోకంటే, మాతృత్వపు మమకారంతో హృదయం ద్రవించింది.

చిట్ట చివరికి ఎలాగైతేనేం అతను మాట్లాడటం ప్రారంభించాడు.

"సంధ్యా! నా మీద అసహ్యం గాని, అనుమానం గాని వుంటే ఇప్పుడే నా మొహం మీదవేసైట పెట్టెయ్యి. ఇక నేను భరించలేను. నీలోకరినత్వంచూసి చూసి అలిసిపోయాను. నా సహనానికి అంతం చూశావు నువ్వు. బాబు ఎవరో నాకెందుకు చెప్పలేదూ అంటూ యింత క్రితం నామీద నిష్ఠూరం వేశావు. వాడిని గురించి నీకు చెప్పాలని నేను ఎన్నిసార్లు ప్రయత్నించానో, ఎంతతహ

కాహలాడానో నీకెలా తెలుస్తుంది! ఎప్పటికప్పుడే చెప్పాలని ఆరాటం. మళ్ళీ దాని వెంటనే చెప్పగానే వాడినికూడా నామూలంగా అసహ్యించుకుని ద్వేషిస్తావేమోనని భయం ఈ రెండూ అంతరంగాలై కారాగా మారి విద్రాక్షిణ్యంగా నన్ను నలకొట్టడం ప్రారంభించాయి. ఓ విధంగా వాడి ద్వారా నిన్ను పొందాలని నేను ఆశించిన మాట నిజమే. కాని నువ్వు వాడినే నా మంచి లాక్కున్నావు. బాబు నా కొడుకైకూడా నామీద ద్వేషం మరిపించి నీ మనసులో స్థానం ఏర్పరచుకున్నాడు. అప్పుడప్పుడూ మీ యిద్దరూ కలిసి ఆనందంగా వున్న దృశ్యాలు చూస్తే నాకు యీర్ష్యతో పిచ్చెక్కుతుందేమో అన్పించేది ఇంతక్రితం ఏం అపకారం చేశానని నన్నిలా మొదటి మంచి చిత్రవధ చేస్తున్నారు? అన్నావు. కాదు సంధ్యా కాదు. అపకారం చేసింది నేను. దాన్ని గుర్తించి సరిచేయాలని ప్రయత్నించి, ఎటువైపునుంచి మార్గం దొరక్క అల్లాడిపోతూ చిత్రహింసకి గురి ఐంది నేను. తప్పు చేసింది నేను. అదితెలుసుకుని పశ్చాత్తాపపడిన తర్వాత కూడా పూర్తి శిక్ష అనుభవించింది నేను. నా మూలంగా నీకు అన్యాయం జరిగి నీ జీవితం శిధిలమైందని తెలుసుకున్న రోజున నేనెంత సిగ్గుపడ్డానో, ఆవేదనతో ఎంత కుమిలిపోయానో నీకు తెలియదు. ఆ క్షణంనుంచి దిగజారిన నీ పరిస్థితుల్లోంచి నిన్ను లేవనెత్తి హృదయానికి హత్తుకోవాలని, నా జీవితపు సింహాసనంమీద మహారాణిగా నిన్ను కూర్చోపెట్టాలని ఎంత తాపత్రయపడ్డానో, ఓపికతో ఎంత ప్రయత్నించానో ఆ భగవంతుడికే తెలుసు. నువ్వీ పూరుమూల, ఏ వసతీ లేని ఈ పల్లెటూళ్ళో, ఈ నిరక్షర కుక్షులమధ్య, కాయకష్టంతో, అజ్ఞాతంగా బ్రతుకు వెళ్ళదీసుకోటానికి నేనే బాధ్యుడిని అన్న సంగతి అనుక్షణం నన్ను శూలంలా గుచ్చిగుచ్చి పొడుస్తూ ఉండేది. భోజనానికి కూర్చుంటే కళ్ళ ముందు రుచికరమైన ఆహార పదార్థాలు చూడగానే ఆరోజు నువ్వు కడుపునిండా తిన్నావో లేదో అని గుర్తుకువచ్చేది. రాత్రి అవగానే మెత్తటి ప్రక్కమీద శరీరం వాల్చగానే నీకు ప్రక్కమీద దుప్పటి అయినా వుందో లేదో అనే అనుమానం వచ్చేది. ఆ ఆలోచన రాగానే అప్పటికప్పుడు లేచి వచ్చి చూడాలనిపించేది. ఇలా ఎన్నో విధాలుగా నువ్వు నన్ను అనుక్షణం వెంటాడుతూనే వుండేదానివి. ఇన్ని సంపదల మధ్య వుండికూడా ఏమీ అనుభవించ లేని మానసిక దారిద్ర్యానికి గురి చేశావు. ఎంతసేపు నా ఆలోచన్లు నీ చుట్టూనే తిరుగుతూ వుండేవి. నీ జీవితం ఎలా చక్క బరచాలి? ఏ విధంగా నీకు సుఖం కల్పించాలి? ఏం చేస్తే నీకు ఆనందం లభిస్తుంది! రాత్రిం బవళ్ళు యివే ప్రశ్నలు. వాసుకి నేను చేస్తున్న సాయం నువ్వు గరళంలా మింగి వూరుకుంటున్నావని తెలుసుకున్నాను. అది గుర్తుకొస్తే మరీ బాధ కలిగేది. నిన్ను సుఖపెట్టాలనే ప్రయ



త్నంలో విపరీతంగా బాధిస్తున్నాను తెలిసికూడా నాకు తప్పలేదు. వాసుకు నేనుచేస్తున్నసాయంలో నీకు సంబంధం లేదని నీ ప్రమేయమే లేదని ఎన్నో సార్లు చెప్పాలని ప్రయత్నించాను. కాని నీ కనుబొమ్మల్లో ముడి చూడగానే నా

నోట్లో మాట నాలిక చివర ఆగిపోయేది. నిజంగా నాసే లేకపోతే నేను ఏమయి పోయేవాడిని? నీ జీవితపు టంచుల వరకైనా నన్ను రానిచ్చేదానివా? రానివ్వవని నాకు ఖచ్చితంగా తెలుసు."

"నన్ను - నన్ను క్షమించండి_" గద్గదికంగా అంది సంధ్య.

మాధవ్ ఆ మాట విన్పించుకునే



ధోరణిలోనే లేదు. అతను చెబ్తూనే వున్నాడు. "మంచితనంతో నన్ను గుర్తింపబడేలాగా చేసుకోవాలని,నువ్వూహిస్తున్న నేను నేను కాదని, మరో కరినని రుజువుచేయాలని సహనంతో, పట్టుదలగా ప్రయత్నించాను. కానీ లాభంలేకపోయింది. నువ్వెప్పటికీ నాకు దక్కవనే అనుకున్నాను. ఓటమి అంతే ఏమిటో ఎప్పుడూ ఎరుగని మనసుఆగ్రహంతో, పశుబలంతోనైనా సరే లొంగదీసుకోమని ఆజ్ఞాపించసాగింది. భార్యగా వుండటానికి ఇష్టపడకపోతే దానిసగానైనా కట్టి పడేసుకో అని శాసించసాగింది. అనురాగం గుర్తించని మనిషి అయితే అధికారంతో లొంగదీసుకో అని హెచ్చరించటం ప్రారంభించింది. చివరి చివరికి నామీద నాకే నమ్మకం సడలిపోవటంతో భయపడి నీకు దూరంగా ఉండాలనే ప్రయత్నంతో బిజినెస్ టూర్ అన్నపేరుతో వూళ్లు తిరగసాగాను. మన కంపెనీ తరఫునుంచి జర్మనీ వెళ్ళేందుకు అవకాశం వచ్చింది. అక్కడికి వెళ్ళి ఎలాగో అలాగు ఎంత క్లిష్టమైనా సరే

ప్రయత్నించి అక్కడే వుండిపోవాలని యిక తిరిగి రాకూడదని నిశ్చయించుకున్నాను. కానీ అనుకున్నంత త్వరగా వీసా రాలేదు. ఈ లోపల యీ చుట్టుప్రక్కల వుండడం యిష్టంలేక ఆ టూర్ పెట్టుకున్నాను. కలకత్తాలో వుండగా వీసా దొరికినట్టుగా కంపెనీనుంచి వుత్తరం వచ్చింది. వెంటనే బైలుదేరాను. ప్లాట్‌ఫారమ్ మీద తిరుగుతుండగా నా పర్సు కలిసివున్న డైరీ ఎవరో కొట్టేశారు. టికెట్ కూడా అందులోనే వుంది. మరో టికెట్ కొనే వ్యవధానం లేదు. ట్రెయిన్ కదలబోతోంది. అందుకని ట్రెయిన్ ఎక్కేశాను. ట్రెయిన్ కలకత్తా వదిలిన అరగంటకే ప్రమాదం జరిగిపోయింది. నేను నిద్రలో వున్నాను. హఠాత్తుగా ఏదో పెద్ద చప్పుడు వినిపించింది. కళ్ళు తెరచి చూశాను. కొద్దిగా మెలకువ రాగానే లేవబోయాను. వెంటనే మీద ఏదో పడటంతో కుప్పలా బోర్లా కూలిపోయాను. తర్వాత ఏమైందో నాకు తెలియదు. వెన్నుమీద, మోచేతి దగ్గర బలమైన గాయాలు తగలటంతో నాకు మళ్ళీ స్పృహ వచ్చేసరికి నాలుగైదు రోజులు పట్టింది. స్పృహ వచ్చిన తర్వాత కూడా ఆ మగతా అదీ తగ్గి బాగా తెలివి వచ్చేసరికి మరో రెండు రోజులు పట్టినాయి. అదే హాస్పిటల్లో సత్యాగ్రహం సమయంలో నాతోపాటు జైల్లో ఉన్న డాక్టరు ఛీఫ్‌గా పని చేస్తున్నాడు. ఆయన నన్ను చూడగానే గుర్తుపట్టి ప్రత్యేకమైన శ్రద్ధ కనపరిచాడు ఆయన బాగా జాగ్రత్త తీసుకోకపోతే నేను బ్రతికేవాడిని కూడా కాదేమో! ఆయనిచ్చిన ట్రీట్‌మెంట్‌తోనే నా గాయాలుకూడా త్వరగా నయమయినాయి. మీవాళ్ళ అడ్రస్ ఇవ్వు. టెలిగ్రాం ఇస్తాను అని ఆయనంటే నేను శ్యామసుందరంగారి అడ్రస్ ఇచ్చాను ఆయన దాన్ని చూస్తూ 'అరె! ఈయన రెండు రోజుల క్రితమే వచ్చి వెళ్ళాడు. ఆయన లీగల్ ఎడ్వయిజర్‌గా ఉన్న కంపెనీ ఓనర్ కూడా ఇదే ప్రమాదంలో చిక్కుకుని చనిపోయాడు. ఫలానా అని గుర్తుపట్టటానికి శవాలన్నీ వెతకలేక చచ్చాం' అన్నాడాయన. నేను వులిక్కిపడ్డాను. వెంటనే నవ్వేశాను కూడా. ఇంతలో ఎవరో రావటంతో డాక్టర్ అక్కడినుంచి బైటకి వెళ్ళిపోయాడు. నేను మొదట నవ్వేసినా క్రమేపీ ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. నేను కోరుకున్నది కూడా ఇదే. కాని మరో రకంగా జరిగింది. మృత్యువు నన్ను అందుకున్నట్టే అందుకుని మళ్ళీ జీవితంలోకి విసిరేసింది. హఠాత్తుగా నా చావు కబురు వినగానే మీరంతా ఎలా అనుకుంటారో అనేక దృశ్యాలు కంటి ముందు తిరిగాయి. చివరికి ఏమైనాసరే అలాగే మరణించిన వ్యక్తిగా అజ్ఞాతంగానే వుండదలుచుకున్నాను. డాక్టర్ టెలిగ్రాం ఫారమ్‌తో తిరిగి వచ్చాడు. 'నేను పంపిస్తాను' అన్నాను. నేను పంపలేదని, దాన్ని చించేశానని ఆయనకి తెలియదు. డాక్టర్ నా కుటుంబాన్ని గురించిన వివరాలు అడిగాడు. ఎవరూ లేరని చెప్పాను. శ్యామసుందరంకూడా పరిచయస్థుడుమాత్రమే. కొద్ది

రోజులు అతని దగ్గర విశ్రాంతిగా వుండటానికి అవకాశం వుంటుందేమో తెలుసుకోటానికి మాత్రమే అతనికి టెలిగ్రాం యిచ్చానని చెప్పాను. ఇంత వయసు వచ్చిన తర్వాతకూడా నాకు పెళ్ళికాకపోటానికి, నా కొలాటి ఉద్యోగం లేకపోటానికి ఆయన ఆశ్చర్యం మాటల్లో కనపరచనే కనపరిచాడు. ఆయనకి భార్య పోయింది. పిల్లలంతా పెద్దవాళ్ళయి వేరుపడి పోయారు. ఒక్కడే ఉంటున్నాడు. దగ్గర ఒకే కాంపౌండరు ఒక నర్స్ తప్ప యింకెవరూ లేరు. నేను వుండటానికి ఏమీ అభ్యంతరం లేదని, పైగా చాలా సంతోషిస్తానని చెప్పాడు కొద్దిరోజులు బాగా ఆరోగ్యం చిక్కి మామూలు మనిషి అయే వరకూ ఆయనదగ్గరే వుండాలని నిశ్చయించుకున్నాను నేనుఅనుకున్నదానికంటెత్వరగానే కోలుకున్నాను. గాయాలు మానిపోతున్నాయి. అవి మానిపోతే నేనెక్కడ వెళ్ళిపోతానో అని బెంగపడుతున్నట్టుగా డాక్టరు చెప్పడం ప్రారంభించాడు. అక్కడే ఏదయినా ఉద్యోగం చూసుకుని తన దగ్గరే ఉండిపొమ్మని బలవంతం చేయసాగాడు. కాని నాకు మాత్రం ఇష్టంలేకపోయింది. మెల్లగా ఎలాగో అక్కడినుంచి వెళ్ళిపోవాలనే ఉంది ఆ రోజు గడిస్తే వెళ్ళిపోయేవాడినే! కాని, అక్కడ కూడా నాకు అదృష్టం ఎదురుతిరిగింది. ఆ రోజు ఉదయం ఆయన క్లినిక్‌లో పేపరు చూసుకుంటూ కూర్చున్నాను. ఎవరో పేషంట్స్ వచ్చారు. డాక్టరు కూడా అక్కడే ఉన్నాడు. వచ్చిన పేషంట్‌కి కడుపులో నొప్పిట. విపరీతమైన బాధతో కేకలు పెడుతున్నాడు. అంత నొప్పిలోనూ, అంత బాధలోనూ నన్ను చూడగానే వచ్చి అమాంతం కాళ్ళకి చుట్టేసుకున్నాడు. కడుపు నొప్పి మాట వదిలేసి బిగ్గరగా ఏడుస్తూ "మీ రిక్కడ వుండగానేనా! ఆ వెధవలు అంత పుకారు లేపారు." ఏదేదో వాగటం ప్రారంభించాడు. నేను పేపరు ప్రక్కకు తీసి అతన్ని చూడగానే నీళ్ళు కారిపోయాను నా కాళ్ళు చల్లబడినాయి. అతను మన కంపెనీ సూపరింటెండెంట్ బుద్ధి మంచిది కాదు. అతనిమీద చాలా ఆరోపణలున్నాయి. కాని పిల్లలుగలవాడని నేనే ఎప్పటికప్పుడు వార్నింగ్ ఇస్తూ అట్టిపెడుతూ వచ్చాను. వాడిని ఉద్యోగంలోంచి తీసేశారుట. ఉద్యోగంకోసం వెతుక్కుంటూ బావమరిది ఇంటికి వచ్చాట్ట. ఇంట్లో భార్య, బావమరిది, అత్త నానా మాటలు అంటున్నారుట. ఆ బాధతోనే ఏది తిన్నా అరక్క నొప్పి వస్తోందిట. ఉద్యోగం తీసేసినందుకు కంపెనీ వాళ్ళని, మాటలు అంటున్నందుకు ఇంట్లో వాళ్ళని కలగాపులగంగా కలిపి కసితీరా తిట్టటం ప్రారంభించాడు.

డాక్టర్ కళ్ళజోడులోంచి ఇదంతా చూస్తూ ఒక్కమాట కూడా పొల్లుపోకుండా వింటూనే వున్నాడు.

"ఇతనెవరో నాకు తెలియదు—"

అవి దబాయించబోయాను. కానీ ఆయన నన్ను మాట్లాడవద్దన్నట్టు చేత్తో సైగచేసి సూపరింటెండెంట్ నుంచి సవివరంగా అంతా తెలుసుకున్నాడు. అప్పటికప్పుడే స్వయంగా టెలిగ్రాం రాసి కంపెనీకి పంపించాడు. కంపెనీవాళ్ళు వచ్చేవరకూ నన్ను దాదాపు ఖైదీలా బంధించి వుంచాడు. ఆ రాత్రి నా అంతట నేనే అతనికి జరిగిందంతా చెప్పేశాను.

అంతా విన్న తర్వాత "కుర్రాడిని గురించి నువ్వు చెప్పకపోవటం బాగా లేదు. కుర్రా డెవరో చెప్పిన తర్వాత కూడా ఆ అమ్మాయి అలా పాషాణం లాగానే ప్రవర్తిస్తే అప్పుడు నువ్విలాటి నిశ్చయం తీసుకున్నా న్యాయంగా ఉండేది" అన్నా డాయన.

"ఏమన్నాడు?" ఊపిరి బిగబట్టి వింటున్న సంధ్య ఆదుర్దాగా అడిగింది. మాధవ్ మళ్ళీ చెప్పాడు. సంధ్య కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"టెలిగ్రాం చూడగానే పార్ట్నర్స్. శ్యామసుందరంగారు బైలుదేరివచ్చారు. నన్ను చూడగానే శ్యామసుందరంగారు కన్నీళ్ళతో అమాంతంగా కౌగిలించుకున్నాడు డాక్టరుగారికి పదేపదే కృతజ్ఞతలు తెలుపుకున్నాడు. శ్యామసుందరంగారు అప్పటికప్పుడు నీకు టెలిగ్రాం యిస్తానన్నాడు. నేనే వద్దన్నాను. అక్కడినుంచి నరాసరి హైదరాబాద్ వచ్చేశాం. వాసు మొదట చూడగానే శిలానే మూర్ఛపోయాడు. కంపెనీ నుంచి జర్మనీకి యింకొకరిని పంపటానికి ఏర్పాటు చేశారు. అది కాస్సి

లియుంది. నేను వచ్చాను కాబట్టి నేనే వెల్తున్నాను. టైమ్ కూడా ఎక్కువలేదు సరిగ్గా నాలుగే రోజులుంది. ఎలాగూ దూరంగా వెళ్ళిపోతున్నాను. ఆఖరిసారి బాబుని నిన్ను కళ్ళారా చూసి వెడదామని యింటికి వచ్చాను "

మాధవ్ వూపిరి పీల్చుకోటానికి ఆగాడు.

సంధ్య చేతివేళ్ళు అతని జుట్టులోకి పోయి అప్రయత్నంగానిమరసాగినాయి.

"నేను ఈ రోజు రాగానే నువ్వలా వచ్చి పెనవేసుకుపోతే నా రహస్యం బైటపడిపోయింది, నే నెవరో నీకు తెలిసిపోయిందనే అనుకున్నాను. స్పృహ తప్పిన నిన్ను మంచంమీద పడుకోబెట్టి ఆత్రంగా లోపలికి వచ్చి ఇనప్పెట్టెలో చూస్తే నేను పెట్టివెళ్ళిన ఉత్తరం తాకిన జాడే కన్పించలేదు. నా సంతోషం ఎగిరిపోయింది. ఉత్సాహం నీళ్ళు కారిపోయింది."

"ఉత్తరమా? ఎక్కడా? నేను చూడనేలేదు___" సంధ్య ఆదుర్దాగా తొంగురుగా అడిగింది.

"నేను వెళ్ళేరోజు రాత్రి కూర్చుని నీ పరిచయం నా జీవితాన్ని ఎలా అల్లకల్లోలం చేసిందీ మొదటినుంచీ చివరి వరకూ వివరంగా వ్రాసిపెట్టాను. నేను వెళ్ళింతర్వాత దేనికోదానికి ఇనప్పెట్టి తెరిచినప్పుడు చూస్తావని ఆశించాను."

"నేను చూడనేలేదు. మీరు వెళ్ళిన తర్వాత సిస్టర్ రాకతో నా మనసు వికలమైతే, ఆ రైలు ప్రమాదం వార్త పూర్తిగా మతే పోగొట్టింది."

"ఇంతక్రితం నువ్వలా పడుకొని నీళ్ళు తిరిగిన కళ్ళతో చెయ్యి అందిస్తుంటే దాన్ని అందుకోకుండా వుండటానికి నేనెంత మనసు చిక్కబట్టుకోవాల్సి వచ్చిందీ నీకు తెలియదు. నా రాక కేవలం చచ్చిపోయిన మనిషి బ్రతికి రావటంవల్ల కలిగిన ఆనందం అంతే, అంతకంటే ఇంకేం లేదనుకున్నాను. క్షణంక్రితమే ఆ ఉత్తరాన్ని చించి అవతల పారేశాను. జన్మలో నీకిది చెప్పే అవకాశం రాదని. అయిపోయిందనే అనుకున్నాను "

"ఏదీ? నేను బాబుని ఎత్తుకొచ్చేసరికి మీరు చూస్తున్న కాగితాలేనా?"

మాధవ్ అవునన్నట్టు తలూపాడు.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ఏర్పడింది.

మాధవ్ తల సంధ్య ఒళ్ళో మళ్ళీ అశాంతిగా అటూ ఇటూ కదిలింది.

"జ్యోతి పట్లా, సుధ పట్లా నా ప్రవర్తన మీద నీకున్న అనుమానాలు నేను గ్రహించక పోలేదు___"

సంధ్య ముఖం ఎర్రబడింది. చప్పున అరచేయితీసి అతని నోటికి అడ్డుగా పెట్టింది. మాధవ్ దాన్ని మృదువుగా తప్పించి చెంపకి ఆనించుకున్నాడు. "నువ్వు మళ్ళీ కన్పించకముందే సుధని నేను తోబుట్టువులా చూడటం ప్రారంభించాను. జ్యోతి మీద

వాకిప్పుడూ ఎలాటి ఆసక్తి లేదు. కానీ యిదంతా నీకెలా చెప్పటం! నా పీడని చూసినా అసహ్యించుకుంటూ, నాగాలి సోకితేనే విషపూరితం అనుకుంటున్న సమయంలో—"

సంధ్య బలవంతంగా రెండు చేతులు అతని నోటికి అడ్డుపెట్టేసింది. క్షణం సేపు మాత్రం ఆగిన మాధవ్ సంధ్య రెండు చేతులూ దోసిలిలా తీసుకుని అందులో ముఖందాచుకున్నాడు. వెచ్చగా వస్తున్న అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సంధ్య అరచేతుల్ని తాకుతున్నాయి.



అతని కంఠం రామరాను మంద్రస్థాయిలోకి దిగిపోయి మరింత గంభీరంగా మృదు మధురంగా వినిపిస్తోంది. "సంధ్యా! ఏ అదృష్ట దేవత యీ రోజు నీ అంతట నువ్వే ఈ ప్రసంగం ఎత్తేలా పురిగొల్పిందో తెలియదు. కాని ఆ అదృష్ట దేవతకి హృదయపూర్వకమయిన ప్రమాణాలు అర్పించకుండా వుండలేను. నీకుగా నువ్వు యీ అవకాశం కల్పించకపోతే నిజంగానే యెప్పటికీ నా పెదవులు కదిలేవి కావు నేనేంచేసినా నిన్ను మరింత బాధ పెట్టిన వాడిని అవుతానేమో అన్న భయం నన్ను వివశుడిగా చేయసాగింది. ఇప్పుడు చెప్పు. నేనేం చెయ్యాలి? రెండుమూడు రోజుల్లో యీ దేశంనుంచే వెళ్ళిపోతున్నాను. నన్నేం చెయమంటావు?—"

ఈ మాధవ్‌నేనా తను పోగొట్టుకోబోయింది! ఇతనినేనా అలా చూపులనే బాణాలు విసిరి, మాటలనే కత్తులుదూసి దూరం చెయ్యాలని అహర్నిశలూ ప్రయత్నించింది! ఇంత దురదృష్టంలో ఏ అదృష్టదేవత కరుణించి ఆశీర్వదించింది! సంధ్య కళ్ళలో నిండుకున్న నీళ్ళు జారి అతని క్రాప్‌మీద పడ్డాయి.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ఏర్పడింది.

మాధవ్ మాట్లాడి మాట్లాడి అలిసిపోయిన వాడిలా యింకా అలాగే కూర్చున్నాడు కాలమే నిల్చిపోయిందా. ప్రకృతే స్తంభించిపోయి చూస్తోందా అనంత నిశ్శబ్దంగా వుంది అంతటా.

అలా ఎంతసేపు కూర్చున్నారో ఇద్దరికీ ధ్యాసేలేదు.

"సంజా—" బాబు ఉన్నట్టుండి పిలవటంతో ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. వాడు మంచంమీద లేచి కూర్చుని కళ్ళు నలుపుకుంటూ చూస్తున్నాడు. నిద్ర మత్తుతో బరువుగా ఉన్న వాడి కళ్ళకి మంచంమీద కూర్చున్న సంధ్య ముందు నాన్నలాంటి మనిషి ఎవరో మోకరిల్లి, కూర్చుని ఒళ్ళో తల దాచుకోవటం కన్పించింది.

ఆశ్చర్యంగా చూస్తూ "ఎవలూ" అన్నాడు.

"బాబు లేచాడు." మాధవ్ కదలక పోవటం చూసి కంఠం తగ్గించి మెల్లగా అతని చెవిదగ్గరగా అంది సంధ్య

"లేస్తే లేవనీ! నాకిలా కూర్చుంటే చాలా శాంతిగా, హాయిగా ఉంది. నన్ను లెమ్మనకు." సంధ్య చీర కుచ్చెళ్ళని రెండు చేతుల్తో గట్టిగా పట్టుకుంటూ అన్నాడు మాధవ్.

"మీ యిష్టం. కాని ప్రశ్నలకి తట్టుకోవడం కష్టం అని నా భయం." అప్పటికే తండ్రిని గుర్తుపట్టేసిన బాబు ఆనందంగా 'నాన్నా' అని అరిచాడు.

మాధవ్‌కిక తప్పలేదు. బలవంతంగా లేచి సిగరెట్ వెలిగించుకునే నెపంతో కిటికీ దగ్గరగా వెళ్ళిపోబోయాడు.

"నాన్నా!" తండ్రి తన పిలుపు వినలేదని, తన వునికిని గుర్తించలేదని అనుకున్న వాడు మరింత బిగ్గరగా పిలుస్తూ రెండు చేతులూ జాచాడు.

సంధ్య లేచి మంచి నీళ్ళకోసం టేబిల్‌వైపు వెళ్ళింది.

మాధవ్ వెలిగించిన సిగరెట్ కిటికీ లోంచి బైటకి విసిరేసి వచ్చి బాబు దగ్గరగా మంచంమీద కూర్చున్నాడు.

"ఎప్పులొచ్చావు నువ్వు? నేను నిద్లపోయినప్పులా?" తండ్రి ఒడిలోకి దూకుతూ అన్నాడు.

మాధవ్ మాట్లాడలేదు. బాబు ఎవరో తెలిసిపోయిన తర్వాత సంధ్య కళ్ళముందు వాడిని దగ్గరకి తీసుకోవాలంటే అతనికి ఎలాగో ఉంది. ఇదేం తెలియని బాబు చాలా రోజుల తర్వాత తండ్రిని చూడటంతో ఆనందం పట్టలేక ఒళ్ళోకి ఎక్కి రెండు చేతులూ మెడ చుట్టూ వేసి గట్టిగా అతని హృదయానికి అంటుకుపోయాడు.

"మలే, మలే ఇంకెప్పులూ నువ్వు వూలు వెల్లద్దు."

"అలాగే." మెడచుట్టూ పెనవేసిన బాబు చేతులు విడదీస్తూ అన్నాడు.

"మలేమో! నువ్వు లానప్పుడే ఆయా, సంజ, వాసు మామయ్యా అంతా వచ్చాలు."

మాధవ్ కళ్ళు సంధ్య కళ్ళతో కలిసినాయి.

సంధ్య గ్లాసుతో నీళ్ళు తెచ్చి అందిచ్చింది.

మాధవ్ తీసుకుని బాబుచేత తాగించాడు.

తండ్రితో కాసేపు కబుర్లు చెప్పిన

బాబు మళ్ళీ నిద్రపోయే ముందు చెయ్యి గట్టిగా పట్టుకుంటూ "నేను నిద్రపోతే ను వ్వెళ్ళిపోతావా మళ్లీ!" అన్నాడు అనుమానంగా.

"వెళ్ళను. నువ్వు నిద్రపో."

"వెత్తే?" సందేహంగా చూశాడు.

"వెళ్ళనని చెప్పానుగా। వెళ్ళను. ఒకవేళ వెళితే నిన్ను కూడా తీసుకు వెడ్తాను సరేనా?" ఆప్యాయంగా జుట్టు నిమురుతూ అన్నాడు.

"మరి సంజో?"

"సంధ్యనికూడా తీసుకువెడదాం. సంధ్య అని పేరుపెట్టి పిలవకూడదని చెప్పలేదూ? మర్చిపోయావా?—"

బాబు లేదన్నట్టు తలూపి తండ్రి మెడచుట్టూ చేతులువేసి దగ్గరకు వంచు కుని చెవిలో రహస్యంగా "మలే! అమ్మా అని పిలిస్తే సంజవీపు బద్దలు కొడతా అని చెప్పింది" అన్నాడు.

"ఏం కొట్టదు. కొడితే నాతోచెప్పు. సంధ్య చెవులు గట్టిగా మెలేస్తాను."

మాధవ్‌కాస్త బిగ్గరగానేగంభీరంగా అన్నాడు.

బాబు సంధ్యవైపు కుతూహలంగా రహస్యంగా చూశాడు. సంధ్య నవ్వి పెదవులు బిగించి, కొడ్తా అన్నట్టు బెదిరిస్తూ చెయ్యి చూపించింది. అది చూడ గానే బాబు చప్పున తండ్రి గుండెల్లో మొహం దాచుకున్నాడు.

కొద్దిసేపటికి అలా పడుకునే కబుర్లు చెబ్తూ చెబ్తూనే తండ్రి ఒడిలో నిద్ర పోయాడు. సంధ్య కిటికీ దగ్గర నిలబడి చువ్వలకు తల ఆనించి రెప్ప వాల్చకుండా బైట వెన్నెల్లోకి చూస్తోంది.

మాధవ్ బాబుని పడుకోబెట్టి దిండ్లు సరిచేసి తనుకూడా కిటికీ దగ్గిరగా వచ్చాడు.

సంధ్య వెనక్కి తిరగలేదు.

రెండు నిముషాలు గడిచాయి.

దూరంగా ఎక్కడో తొలికోడి కూత విన్పిస్తోంది. గాలికి చెట్ల ఆకులు రాచుకున్న సవ్వడి తప్ప యింకే శబ్దమూ లేదు

మాధవి చేతులు సంధ్య భుజాలు పట్టుకుని మెల్లగా తనవైపు తిప్పుకున్నాయి. నిర్మలంగా వున్న సంధ్య కళ్ళు అతని ముఖంమీద నిశ్చలంగా నిలిచాయి. క్షణంసేపు దేనికోసమో మళ్ళీ ఆత్రంగా ఆ సోగకళ్ళలోకి వెతుకుతూ నిలబడిన మాధవ్ సమాధానం లభించిన వాడిలా తృప్తిగా చూశాడు.

"సంధ్యా! ఇది నిజమేనా?"

"సరిగ్గా అదే- నేను మిమ్మల్ని అడగబోతున్నాను. మీరే చెప్పండి. నిజమేనా?" మాధవ్ సమాధానంగా సంధ్య తలని దగ్గరకు తీసుకుని గుండెలకి ఆనించుకున్నాడు.

అపురూపమైన అనుభూతిని దేన్నో మొట్టమొదటిసారిగా పొందుతూ వివశురాలైనట్టుగా కళ్ళు మూసుకుంది సంధ్య.

"సంధ్యా!" అతను పలికిన ఆ తీరుని చూస్తుంటే అది పిలుపులా లేదు. అతని హృదయాంతరాళాల లోంచి దూసుకువచ్చినట్టున్న ఆ శబ్దానికి సంధ్య గుండెలో వేయి పూవులు ఒక్కసారి విరిసి కళకళ లాడినట్టు, కోటి వేణువులు ఒకేసారి మోగినట్టు అయింది. మనసు ఆ వేణునాదం వింటూ కళకళ లాడుతున్న ఆ పూల మధ్య గాలికంటే వేగంగా అలలు అలలుగా తేలిపోసాగింది. అతనుకూడా సరిగ్గా ఇలాగే అనుభూతి చెందుతున్నాడా? తెలుసుకోవాలనే ఆసక్తితో కళ్ళు తెరిచి పైకెత్తి చూసింది.

మాధవ్ కళ్ళలో మహా సామ్రాజ్యాలు గెలుచుకున్న విజేత తాలూకు గర్వం లీలగా కదులుతోంది.

"మొత్తానికి నామీద విజయం సాధించారు. అవునా?"

"సంధ్యా!" అదుర్దాగా అన్నాడతను.

సంధ్య నిట్టూర్పు విడిచింది. "కానీ, మీ ముందు ఓడిపోవటంలో ఇంత హాయి, ఆనందం వుందని నేను కల్లోకూడా అనుకోలేదు ఈ ప్రపంచంలో నాకు విశ్రాంతి, నిశ్చింతని ప్రసాదించే చోటు ఇంత దగ్గరగా, నా ఎదురుగుండా ఉందని, దాన్ని నేనే గుర్తించలేని మూర్ఖురాలి నయానని ఇప్పుడుగాని తెలియటంలేదు."

"సంధ్యా! వద్దువద్దు అలా అనకు. ఇది నీమీద నేను విజయం సాధించటం గాని, నామీద నువ్వు గెలుపు పొందటం కాని ఏదీకానే కాదు. చిత్రమైన

పరిస్థితుల్లో అనుకోకుండా నా మంచి పైకు అన్యాయం జరిగింది. అది గుర్తించగానే దాన్ని సరిచేయాలని నా వ్యక్తిత్వం ఆరాటపడింది. ఆ పరిస్థితులతో పెనుగులాడింది. న్యాయానికి, కాలానికి, వ్యక్తిత్వానికి – పరిస్థితులకి జరిగిన ఆ పోరాటంలో వ్యక్తిత్వం బలమైంది కాబట్టి న్యాయానికి విజయం చేకూరింది. అంతే. అంతకంటే ఇంకేం కాదు."

తలెత్తి విప్పారిన నేత్రాలతో అతనివైపు శ్రద్ధగా, ఆసక్తిగా చూస్తోంది సంధ్య అనారోగ్యం వల్ల ముఖం పాలిపోయినట్టువున్నా, చాలా రోజులనుంచి అశాంతికి గురియైనట్టు కళ్ళక్రింద నల్లటి చారలు కన్పిస్తున్నా కళ్ళలో మాత్రం అపూర్వమైన కాంతి కన్పిస్తోంది చాలా సంవత్సరాల క్రితం ఒకసారి భయంతోనే అయినా పరీక్షగా యిలాగే చూసింది అప్పుడు ముఖంలో పరిపూర్ణమైన ఆరోగ్యం, కళ్ళలో ఓ విధమైన నిర్లక్ష్యం కొట్టొచ్చినట్టు కన్పించాయి. ఇప్పుడు నిర్లక్ష్యానికి బదులు గాంభీర్యం, కష్టసుఖాలు అనుభవించి, జీవితం నేర్పిన పాఠాలని జీర్ణించుకున్న హుందాతనం స్పష్టంగా కన్పిస్తున్నాయి. సంధ్యకళ్ళు హఠాత్తుగా అతని చెంపమీద వున్న గంటు మీద నిల్చిపోయినాయి. సంధ్య కళ్ళ కదలికని మాధవ్ చూపులు జాగ్రత్తగా గమనిస్తూనే వున్నాయి. సంధ్య చూపులు తన చెంపమీద వున్న గంటుమీద నిలిచిపోవడం, ఆ వెంటనే ముఖం ఎర్రబడటం చూసిన అతను నవ్వాడు. సంధ్య గుండె లయతప్పింది. అతని నవ్వు యెంత స్వచ్ఛంగా, ఎంత నిష్కల్మషంగా, స్త్రీ హృదయాన్ని దోచుకునేట్టుగావుంటుందో మొట్టమొదటిసారిగా గ్రహించింది.

చిటికెన వేలికొనతో అతని బుగ్గమీద ఆ గీటు వున్నంత మేరా రాస్తూ "మీరెంత సమర్థించుకున్నా, మీ కళ్ళలో గెలుపు పొందాననే గర్వం కన్పిస్తూనే వుంది" అంది

మాధవ్ తన చెంపమీద రాస్తున్న సంధ్య చేతిని గుప్పెటలోకి తీసి పట్టుకున్నాడు. "అది గెలుపు పొందాననే గర్వం కాదు. ఇప్పటికైనా నువ్వు నన్ను గుర్తించి స్వీకరించావనే తృప్తి ఇన్నాళ్ళకైనా నేను పొందగలిగాను కదా అనే ఆనందం. అంతే. తృప్తికి, గర్వానికి, ఆనందానికి, అతిశయానికి తేడా చెప్పలేని కొన్ని ప్రత్యేకమైన సన్నివేశాలుంటాయని నీకు తెలియదా సంధ్యా!" అనునయంగా అడిగాడు అతను. సంధ్య పల్చటి పెదవులమీద చిరునవ్వు కదలబోయింది. కాని. అంతలోనే కళ్ళనిండా గిర్రున నీళ్ళు కంపించినాయి.

"సంధ్యా!" మాధవ్ ఆదుర్దాగా దప్పున దగ్గరకు తీసుకున్నాడు. రెండు నిముషాలు నిశ్శబ్దంగా మూగగా గడిచిపోయినాయి. సంధ్య కన్నీళ్ళతో మాధవ్ గుండెల దగ్గర షర్టంతా తడిసింది. డగ్గుత్తికతో ఆగిపోతూ, ఆగిపోతూ వెక్కిళ్ళమధ్య చెప్పింది-

"భయంకరమైన గతం లోంచి

యెలాగో అలాగు బ్రతికిబైట పడగలి గాను. కాని అనుక్షణం వేధిస్తున్న వాటి స్మృతులనుంచి మాత్రం తప్పించుకోలేక పోతున్నాను. ఎంత ప్రయత్నించినా నాకు సాధ్యం గావటం లేదు. ఇన్నాళ్ళు గడిచినా వాటి ప్రభావం నామీదనుంచి ఎందుకు పోవటం లేదో నాకే అర్థం కావటంలేదు. నాకు దేనిమీదా నమ్మకం లేదు. ఇది - ఇది కూడా కలో నిజమో యింకా నమ్మకం కుదరనే కుదరటం లేదు."

"సంధ్యా! నా సంధ్యా!" మాధవ్ హృదయం అంతా వుప్పొంగిన మమత అతని చేతివేళ్ళలో ప్రవహిస్తోందా అన్నట్టుగా సంధ్య జుట్టులో అటుయిటు కదిలాయి. అతని కంఠంలో కూడా ఆర్ద్రత నిండిపోయింది.

"మర్చిపో! జరిగిందంతా మర్చిపో! ఈ క్షణంనుంచి మనిద్దరి జీవితాల్లో నూతన అధ్యాయం ప్రారంభమైంది. ఈ క్షణంనుంచి నీ జీవితాన్ని గురించిన ఆలోచన నా చేతిలో పెట్టి నువ్వింక విశ్రాంతిగా ఉండు. కొద్ది రోజుల్లోనే అమృతమయమైన భవిష్యత్ నీ చేత తాగించి ఆ గరళంలాంటి గతాన్ని మరిపించగలను. నీ నుంచి విడిపోని ఆ జ్ఞాపకాల బరువుని వదిలించే బాధ్యత నాది. కానీ—"

మాధవ్ సంధ్యని మోచేతి దూరంలో నిలబెట్టి పరీక్షగా చూస్తూ అన్నాడు. "నువ్వు నాకీ అవకాశం ఇచ్చేసరికే, నేను దాన్ని గెలుచుకునే టప్పటికే నీ జీవితంలో చాలా భాగం వృధా అయిపోయింది. నేను ఎదురుగుండా వుండి చూస్తూకూడా ఏం చెయ్యలేకపోయాను. అదే నా బాధ"

వాన పడిన తర్వాత వచ్చిన ఎండలా టీకాంతినిండిన అతనివైపుచూస్తున్న సంధ్య చూపుడు వేలు అతని పెదవుల మీద ఆనిస్తూ- "నీ జీవితం అంటూ నన్ను విడదీయకండి. మనిద్దరి జీవితాలు అని కలిపి చెప్పండి" అంది.

ఈసారి కళ్ళు చెమర్చటం మాధవ్ వంతు అయింది. అది సంధ్య గుర్తించకుండా వుండేందుకు చప్పున దగ్గరకు లాక్కుని గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు. రెక్కలు రానిపిట్ట గాలివానలో చిక్కడిపోయి గమ్యం తెలియక



వణికిపోతుండగా హఠాత్తుగా తల్లి కన పడగానే రెక్కల క్రింద ఒదిగిపోయి నట్టు సంధ్య అతని చేతుల మధ్య ఒదిగిపోయి గుండెలకి కరుచుకుపోయింది.

ఆ కౌగిలిలో స్త్రీ పురుషులు ఏకమైనప్పుడు సహజంగా కలిగే ఉద్రేకం గాని, ప్రేమికులు తొలిసారిగా కలిసినప్పుడు కలిగే తొందరపాటుగాని లేవు. వయసు గడిచి జీవితంలో అనేక కష్టసుఖాలకి గురియై, చరమ దశలో మనశ్శాంతి ఇచ్చే వ్యక్తికోసం వెతుక్కుంటూ ప్రపంచం చెరో అంచు మంచి బయలుదేరి ప్రయాణం చేసి, అనుకున్న వ్యక్తికోసం వెతికి వెతికి వేసారిపోయి నిరాశతో నిట్టూర్పు విడవబోయే సమయంలో హఠాత్తుగా కావాలనుకున్న మనిషి కనిపిస్తే వెంటనే ఆనందం పట్టలేక తృప్తితో ఒకరిని ఒకరు హత్తుకుపోయినట్టుగా ఉంది.

ఇద్దరూ అనిర్వచనీయమైన అనుభూతిని పొందుతున్నట్టుగా కళ్లు మూసుకున్నారు.

తెల్లవారురూము కావటంతో గాలిలో చల్లదనం మరింత ఎక్కువైంది. బాగా మంచుపట్టటంవల్ల బైట కప్పిస్తున్న వెన్నెల మసకమసకగా తయారైంది. దొడ్లో చెట్టుమీదున్న గూటిలో వెచ్చగా నిద్రపోతున్న పిట్ట ఎందుకో రెక్కలు ఒకసారి టప టపా కొట్టుకుని మళ్ళీ పడుకుంది. ఎక్కడా, ఎక్కడా ఎలాటి శబ్దమూ లేదు. అలాంటి సమయంలో సృష్టికూడా అత్యద్భుతమైన అనుభవాన్ని దేన్నో పొందుతున్నట్టుగా నిశ్చలంగా, నిశ్శబ్దంగా అతి ప్రశాంతంగా ఉంది.

(సమాప్తి)

***

## అంకితం

"మా మతం మానవత్వం; మా కులం మంచితనం; మా జీవిత ధ్యేయం విశ్వ మానవ కల్యాణం." అని ధైర్యంగా చెప్పగలగటమే కాకుండా, అక్షరాలా ఆచరించి చూపించగలిగే వ్యక్తులకి; ముఖ్యంగా అలాటి మగవాళ్లకి.

ప్రేమాభిమానాలతో,
—రచయిత్రి.

## చందాదార్లకు మనవి

పాత చందా దారులు తిరిగి చందా పైకం పంపేటప్పుడు మీ చందా నెంబరు, అడ్రసు వివరంగా వ్రాసి మాతో సహకరించ ప్రార్థన.

మేనేజరు, "జ్యోతి"

నెలాఖరు రోజులు.—

రోడ్డువెంట నడుస్తున్న సుందరరామయ్యగారిని గుడ్డల కొట్టువాడు కేకేశాడు.

పిలవటం ఎవరైనా విన్నారేమోనని చుట్టూచూచి చిన్నబుచ్చుకున్న ముఖంతో కొట్లోకెళ్ళేరు.

చెమటపట్టిన ముఖాన్ని తుడుచుకుంటూ స్టూలుమీద కూర్చున్నారు.

"ఏం పంతులుగారూ, మా కొట్టువేపు రావటం బొత్తిగా మానేశారు ?.."

"ఏదీ శేషాచలం .కాలం కలిసి రావటం లేదు."

"చిన్నమ్మాయి పెళ్ళికి గుడ్డలు తీసుకోరూ ?!—"

"ఆ శుభసమయం ఇంకా రాలేదు శెట్టీ ! అయినా పాతబాకీ తీర్చకుండా మరోచోట యెట్లా గుడ్డలు తీసుకుంటాను చెప్పు ?!—"

"ఏమిటో పంతులుగారూ .. బాకీ విషయం మిమ్మల్ని ప్రతిసారీ అడగాలంటే నాకేబాధగా వుంది."

---

[ఆంధ్రప్రదేశ్ స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ రిక్రియేషన్ క్లబ్ (విజయవాడ) ఇటీవల నిర్వహించిన కథల పోటీలో ప్రథమ బహుమతి పొందిన కథ.]

---



ఎస్. వివేకానంద

"ఏం చేయను చెప్పు. నీ బాకీ గురించే నా ఆలోచన కానీ తీర్చగలిగే మార్గం కన్పించటం లేదు."

"ఒక్క—సారిగా కాకపోయినా పది నెలల్లో పదికాస్తలు సర్దండి పంతులుగారూ !—"

"నా బరువు నాకుమాత్రం తెలీదా చెప్పు. అసలుకంటే వడ్డీ పెరిగిపోతున్నదనే బాధ నన్ను మరీ పీక్కు—తింటున్నది."

"వ్యాపారంలో నాకూ చెయ్యి మెసలాయింపు కాకుండావుంది ...ఈ నెల్లో అయినా కాస్త సర్దుతారేమోనని. అడిగానని బాధ పడకండి !—"

"చూడు శేషాచలం ! నీ మనసు నాకు తెలుసు. ఇదే మరొకరైతే ."

"దానిదేముంది లెండి రోజులన్నీ వకే తీరుగా వుండవు !"

"అగినవాడివి ఎట్లాగూ ఆగావు. మరో నెల రోజులు కాస్త ఓపికపట్టు."



"సరే, కానీయండి."

"నే వస్తానూ !—" అనేసి నీర సించిన హృదయంతో రోడ్డు మీద మళ్ళీ నడక సాగించారు.

మనసులో ఆలోచనా పరంపరలు వేధిస్తున్నాయి. మూడేళ్ళ క్రితం పెద్ద వాడికి ఉద్యోగం దొరికిందని తెలిసి వంద రూపాయలు కొట్లో ఖాతా పెట్టి గుడ్డలు కుట్టించి పంపారు. అప్పటికీ ఇప్పటికీ బాకీ అలాగే నిల్చిపోయింది. తన చేతగానితనాన్ని వివరిస్తూ, డబ్బు పర్దవలసిందిగా కొడుక్కి ఎన్నో ఉత్తరాలు వ్రాశారు. డబ్బు పంపకపోగా ఉత్తరాలకు సమాధానంకూడా వ్రాయటం మానుకున్నాడు.

ఇల్లు చేరేసరికి చిన్నవాడికి జ్వరం తగిలిందని, వళ్ళు మసిలిపోతున్నదని భార్య చెప్పింది. సుందరరామయ్య మనసు బేజారైంది.

పిల్లవాడిని భుజంమీద వేసుకుని ఆస్పత్రికి పరుగెత్తారు. సమయానికి డాక్టర్ లేదు. కొత్త కేసులు చూచే వేళ దాటిందని నర్సు చెప్పింది. పిల్లవాడి వంటిమీద చెయ్యి వేశారు. జ్వరంతో వళ్లు మసిలిపోతున్న పిల్లవాడి విషయం చూడమంటూ నర్సుకు చెప్పి బ్రతిమాలేరు.

"ఏమిటండీ ? ఏం జరిగింది ?" వస్తూనే డాక్టర్ అడిగాడు.

"డాక్టర్ ! పిల్లవాడికి చాలా సీరియస్‌గా ఉంది."

"మరేం భయంలేదు" అనేసి టెంపరేచర్ చూసి,ఇంజక్షన్ ఇచ్చాడు.

"డాక్టర్ ! జబ్బేమిటంటారు ? ."

"అంతగా ఆదుర్దా పడవలసిన విషయం కాదు రేపటికి జ్వరం తగ్గుతుంది"

పిల్లవాడి భవిష్యత్ మీద ఆశాకిరణం చూపించిన డాక్టర్‌కు ప్రతిఫలం కోసం జేబు చూచుకున్నారు కేవలం కొంత చిల్లర మాత్రమే కనిపించింది

"క్షమించాలి డాక్టర్! మీ మేలు మర్చిపోలేను మీ ఫీజు ఫస్టు తారీకున ఇచ్చుకుంటాను"

"ఈ కాస్త విషయాన్ని గురించి బాధపడకండి వెళ్ళిరండి!"

బరువుగా ఇల్లు చేరుకున్నారు పసివాడిని ఇంట్లో ఉంచి మనసు బాగోలేక పోవటంతో అట్లా బజారుకని బయల్దేరిన సుందర్రామయ్యగారు పార్కు చేరుకున్నారు

రేడియోలోంచి ఏవో వార్తలు విన్పిస్తున్నాయి

బెంచీలమీద కూర్చున్న పెద్దమనుషులు పాలిటిక్సు నెమరేస్తున్నారు

లోకం తెలీని పిల్లలు గోలచేస్తూ ఆడుకుంటున్నారు

సుందర్రామయ్యగారి మనసు బరువుగా దేన్నిగురించో ఆలోచిస్తోంది

తీవ్రంగా ఆలోచిస్తున్న మస్తిష్కంలో ఆలోచన మెరుపులా మెరిసింది

మధ్యాహ్నం ఆఫీసులో కలుసుకున్న వ్యక్తి జ్ఞాపకం వచ్చాడు

ఒక చిరునవ్వు నవ్వి గట్టిగా గాలి పీల్చుకుని తల అడ్డంగా ఆడించారు

పార్కులో జనం పల్చబడ్డారు

బాగా పొద్దుపోయిం దన్పించటంతో ఇంటికి బయల్దేరారు

స్నానం ముగించి పంచలో కూర్చున్న సుందర్రామయ్యగారిని భార్య భోజనానికి పిల్చింది

"చూడు శాంతా! నాకు ఆకలిగా లేదు నువ్వూ పిల్లలూ కానీయండి"

"భోజనం మానేస్తే బాధ్యతలు తీరుతాయా చెప్పండి! లేవండి కొంచెం యెంగిలి పడుదురుగాని"

భార్య వడ్డిస్తూ రెండో అమ్మాయిని పురిటికి తీసుకెళ్ళమంటూ అల్లుడు జాబు వ్రాశాడు మీరు అటు ఆఫీసుకెళ్ళగానే ఇటు ఉత్తరం వచ్చింది వచ్చిన తొందర్లో మీతో చెప్పటమే మర్చిపోయాను అంది

గబగబా నాలుగు మెతుకులు గతికి "ఊఁ మజ్జిగ పొయ్" అన్నారు.

"అదేమిటండీ! అప్పుడే మజ్జిగా?"

"కడుపు నిండిందిగానీ కానియ్"

జీవితంలో సుందర్రామయ్యగారు చేసే పనులన్నీ అసంతృప్తిగానే మిగలటం ద్వారా హృదయం గాయపడటమే కాకుండా సంసారభారం పెరుగుతూ రావటం వారి దురదృష్టం

పెద్దమ్మాయికి పెళ్ళి చేశారు పట్టుమని సంవత్సరమైనా గడవకముందే పుట్టెడు దుఃఖాన్ని మూటగట్టుకుని వైధవ్యంతో తండ్రి పంచనే చేరింది

రెండో అమ్మాయి విషయం చూడబోతే ప్రతి సంవత్సరం పురిటి ఖర్చులే కాకుండా సర్వం ఇక్కడినుంచే పంపాల్సి వస్తున్నది

మూడో పిల్ల పెళ్ళికి ఎదిగి గుం డెలమీద కుంపటిగా తయారైంది కొడుకు పెద్దవాడై వుండి సంపాదిస్తూ దేనికీ కొరగాకుండా ఉన్నాడు పసవాడు రోగిష్టివాడు

ఇన్ని సమస్యలతో సంసారాన్ని ఏ విధంగా ఎక్కతీసుకు రావాలో సుంద రామయ్యగారికి అర్థంకాకుండా వుంది

తీరని మనోవేదన వారిని క్షణక్షణం క్రుంగదీస్తూనే వుంది

ఆరుబైట వెన్నెల్లో మంచంమీద పడుకుని పర్యవసానం కోసం ఆలో చిస్తూ దారీ తెన్నూ లేకుండా వున్న సంసారపు టసంపూరిత సమస్యలను గురించి నెమరేస్తున్నారు

"ఎందుకండీ ఆలోచించి మనసు పాడుచేసుకుంటారు ? దిగులుపడితే ప్రయోజన మేముంది చెప్పండి ?—"

"పిచ్చిదానా ! అసలు నాకు మన స్సంటూ వుంటే గదూ పాడుచేసుకునే టందుకు—"

"ఏమిటోనండి ఈ నెల్లో ఖర్చు మరీ ఎక్కువైనట్టుంది చేస్తున్న బాకీలు ఎట్లా తీర్చాలో అర్థంకాకుండా వుంది పోయిన నెలలో పాల బాకీ అట్లాగే వుంది బొగ్గులవాడు డబ్బుకోసం ప్రతి రోజూ తిరిగి పోతున్నాడు ఇంటావిడ క్రిందటి నెల అద్దె బాకీ విషయం మళ్ళీ గుర్తుచేసింది "

"చావనా ఏమిటి ? తెచ్చేదంతా కొంపకే పెడుతున్నానా ? నే నేమన్నా కట్టుకుపోతున్నానా ? ఛ ఛ పాపిష్టి జన్మ ! ఎందులోనైనా పడి చద్దామని వుంది "

ఎందుకండీ అంత బాధపడతారు ? నేను మాత్రం ఏమన్నాననీ? ఎన్నాళ్ళిట్లా చాలీ చాలని జీతాలతో బ్రతుకులు గడప గలమాని—"

మనం బ్రతికి వున్నన్నాళ్లూ సరేనా ! ను వ్వెళ్ళి పడుకో నా మన సేం బాగోలేదు "

శాంతమ్మ లేచి వెళ్ళిపోయింది

సుందరామయ్యగారి మనసు మళ్ళీ అల్లకల్లోలమైంది బాగా అలసిపోవ డంతో కొంచెం కునుకు పట్టింది

* * *

తలుపు తట్టిన శబ్దం విన్పించటంతో లేచి వెళ్ళి తలుపు తీశారు

"నమస్కారమండీ !"

"ఆఁ ఆఁ నమస్తే ! మీరు!"

గోవిందయ్యను పొద్దున మిమ్మల్ని ఆఫీసులో కలిశాను చూచారా "

"ఓహోఁ మీరా ! రండి లోప లికి !—"

పంచలో వున్న కుర్చీల్లో కూర్చు న్నారు

మీతో ఉదయం ఆఫీసులో మనవి చేశాను చూడండీ ఆ విషయమే మీతో తీరుబడిగా మాట్లాడవచ్చని వచ్చాను "

"ఏ విషయం ?"

అదే బిల్లు విషయం !—"

ఏ బిల్లు ?"

"క్షమించండి. నా కాంట్రాక్టు తాలూకూ ఎనభై వేల రూపాయల బిల్లుంది చూశారూ....దాన్నే లక్షకు సరిచేసి తెచ్చాను. తమరు కోప్పడకుండా బిల్లు ప్యాస్ చేశారంటే....మీ కష్టం వుంచుకోను."

"అంటే మీ వుద్దేశ్యం ?—"

"మరేంలేదండీ .. కాస్తవేస్నీళ్ళకు చన్నీళ్ళు ! అంతే !! — మీ పరిస్థితి నాకు తెలుసు."

"అందుకని...నన్ను నేను వంచించు కోమంటారా ?—?"

"క్షమించాలి !— మీ మేలు మర్చిపోను ..."

"ఇందుకా మీరు ఇంత రాత్రి సమయంలో వచ్చారు ? నా సంగతి మీకు తెలీదేమో...."

"నాకంతా తెలుసు ! తమరు కోప్పడకుండా వుంటే ఒక్క విషయం మనవి చేస్తాను."

"ఊఁ...."

"చిత్తం ! ....చూడండీ ! ఈ రోజుల్లో మీకుమల్లే మడికట్టుక్కూర్చునే వారెవరున్నారు చెప్పండి ఎవరి మటుక్కువాళ్లు సుఖపడాలనే స్వార్థంతో బ్రతుకులు చక్కదిద్దుకునే వారే ! అందరిలాగే కాకుండా మనం ధర్మం, న్యాయం అంటూ కూర్చుంటే బరువు బాధ్యతలుగల కుటుంబాలు వెళ్ళమారేదెట్లా చెప్పండీ ?"

"మరోసారి చెప్తున్నాను. నా మనస్సాక్షి అంగీకరించని పని నే చేయను. కూటికి జరక్కపోతే పస్తులుండి చస్తానుగానీ .... ఇలాంటి నీచావికి పాల్పడను."

"అట్లా అంటే యెట్లాచెప్పండీ ??" అంటూ వందరూపాయల నోట్లకట్ట సుందర్రామయ్యగారి చేతిలో వుంచి 'ఇది వుంచండి' అన్నాడు.

"రామ ! రామ !! ఇలాంటి పన్లు చేసే వాళ్ళను నీచంగాచూచిననేను..."

"క్షమించండి !– ఇంతటితో నే కాదు. నేను మళ్ళీ తమకు కన్పిస్తాను. నామాట వినండి. నాకు సాయంచేసిన వారూ అవుతారు. మీ కష్టాలూ గట్టెక్కుతాయి ..మరి నే వెళ్ళొస్తాను." అని ఛరచరా వెళ్ళిపోయాడు.

సుందర్రామయ్యగారు చేతిలోవున్న నోట్లకట్టకేసి తీక్షణంగా చూశారు. గుండె వేగంగా కొట్టుకోనారంభించింది. కాళ్ళు చేతులు వణకసాగాయి. డబ్బునువెంటనే భుజానవున్న తుండులో దాచారు.

లేచివెళ్ళి వీధివాకిలి తలుపువేసి వచ్చి నిద్రపోతున్న భార్యను తట్టి నిద్ర లేపారు.

"ఏమిటండీ ? ఏం జరిగింది ?"

"ష ! అరవకు" అనేసి, ఇంట్లోకి నడవమంటూ సైగ చేశారు.

"శాంతా ! ఈ డబ్బు జాగ్రత్త చెయ్."

"అమ్మో ! ఇంత డబ్బే ! ఎక్కడిదండీ ?"

"విషయం తర్వాత చెప్తాను. ముందు డబ్బు జాగ్రత్త చెయ్" అనేసి

మళ్ళీ వాకిట్లో కొచ్చి మంచంమీద కూర్చున్నారు.

గుండె శబ్దవేగాన్ని అధిగమిస్తోంది.

ఒళ్ళంతా చెమట పట్టింది.

కూర్చున్నవారల్లా మంచంమీద పడుకుని రెండు చేతులూ గుండెలమీద పెట్టుకున్నారు.

చల్లగాలి వీస్తున్నా ప్రకృతిలో గాలి స్తంభించినట్టుంది.

జీవితంలో మొదటిసారిగా తృప్తిగా నవ్వుకున్నారు అనుకోకుండా వచ్చిన డబ్బు ఎన్నో ఆలోచనలను ప్రేరేపిస్తున్నది.

ఇన్నాళ్ళూ పెళ్ళి చేయలేక బాధపడుతున్న సుజాత పెళ్ళి చేయచ్చునిపించింది. పాత బాకీ ఇవ్వమంటూ పదేపదే వత్తిడిచేసే శేషాచలం బాకీ తీర్చవచ్చు. పెద్దమ్మాయి సరోజకు మిషన్ నేర్పించి, ఒక స్వంత మిషనొకటి ఏర్పరిస్తే దాని బ్రతుకు అది బ్రతుకుతుం దనుకున్నారు.

ఇన్ని రోజులుగా తన హీనపరిస్థితి చూచి హేళన చేస్తున్న సహోద్యోగుల నోళ్ళు మూయించ వచ్చునిపించింది,

ఆలోచనల రంగుల రాట్నం మనసులో వేగంగా తిరుగుతోంది.

41 మళ్ళీ ఆలోచన....దాని వెనుక సమస్య....వాటి వెనుక భయం....

ఓమారు శ్వాస గట్టిగా పీల్చుకుని బరువుగా స్వగతంగా నవ్వుకున్నారు. ప్రస్తుతానికి కష్టాలు గట్టెక్కినట్టే అనుకున్నారు. భగవంతుడు తనకీ విధంగా సాయపడ్డందుకు అంతరంగంలో కృతజ్ఞత వెలిబుచ్చారు.

భయం మరోకవైపు క్రుంగదీయనారంభించింది. తాను చేసింది నేరం! ఇన్నాళ్ళూ అందరూ చేసి సుఖపడ్తున్న పని ఇప్పుడు తను చేస్తే నేరమెట్లా అవుతుందీ అని మళ్ళీ అనిపించింది.

ఈ విషయం మరో కంటివాడికి తెలిస్తే? లేదా తనను పరీక్షించేందుకై ఎవరైనా పన్నిన పన్నాగమా? ఏదీ అర్థం కాకుండా ఉంది.

ఒకవేళ ఇది ప్లానే అయితే....భవిష్యత్ ఏంగాను? భార్యా పిల్లల గతేమవుతుంది? సంఘంలో తానొక నేరవేస్తారు....అంటగొంతని. ఉద్యోగంలోంచి తీసేస్తారు. అంతేగాదు.... సమాజం హీనంగా చూస్తుంది.

చేసిన నేరానికి, ఎదుటివారి కుటిల పన్నాగానికి సంసారం ఛిన్నాభిన్నమవుతుంది. తినో తినకో పరువుగా బ్రతికే సంసారం బజారుపా లవుతుంది.

ఇన్నాళ్ళూ ఏ పనయితే చేయగూడదు, న్యాయ విరుద్ధం, అధర్మం అనే నీతి నియమాలతో, జీవితాన్ని అర్థానందంతో నెట్టుకొస్తున్నారో.... అదే పని ఈనాడు చేశారు. ఏం, ఆమాత్రంస్వార్థం మనిషిలో వుండకూడదా అన్పించింది. సుఖపడే మార్గం కోసం మరో విధంగా చెయ్యి చాచటం అవినీతా? పైగా తనకై తనేలంచ మియ్యమని యాచించ లేదే? అదృష్టమే ఈ రూపంలోవచ్చి తనను వరించిందని తృప్తిపడ్డారు.

కాదు....తాను చేసింది నేరం! అని [illegible] సంఘం

# పోటీదార్లకు మనవి

"జ్యోతి" మాసపత్రిక కళాశాలల, విశ్వవిద్యాలయాల విద్యార్థినీ విద్యార్థుల నిమిత్తం "చిన్న చిన్న కథల పోటీ" నిర్వహిస్తున్నది. దీనిలో పాల్గొనేవారు ఈ క్రింది నిబంధనలు పాటించ గోరుతున్నాము.

1. కథలు "జ్యోతి"లో రెండు మూడు పేజీలకు మించరాదు.

2. స్వకపోల కల్పితమైన స్వతంత్ర రచనలే పంపించాలి.

3. తమ పూర్తిపేరు, చదువుతున్న తరగతి, కాలేజీ, లేక విశ్వవిద్యాలయం పేరుతో సహా పూర్తి చిరునామా జత పరచాలి.

4. ప్రతినెల 1వ తేదీ వరకు అందిన రచనలనే ఆ పైనెల సంచికలో పోటీకి పరిగణిస్తాము.

5. బహుమతి పొందని రచనలు త్రిప్పి పంపబడవు. అందుచేత స్టాంపులు పంపించ నవసరం లేదు. రచనల విషయమై ఉత్తర ప్రత్యు త్త రాలు జ...

దూషిస్తున్నది. సమాజం వెలేస్తున్నది! చట్టం శిక్ష విధిస్తున్నది!

మళ్ళీ తలుపు తట్టిన శబ్దమైంది.

ఆలోచనల నుండి తేరుకుని లేచి వెళ్ళి తలుపు తీశాడు.

"సుందర్రామయ్య మీరేనా ?—" అధికార స్వరం కఠినంగా ప్రశ్నించింది.

నోట మాట రాలేదు....

"మాట్లాడరేం ?"

"నేనే !" హీనస్వరంతో సమాధానం వచ్చింది.

"అయితే మీ ఇల్లు సోదా చేయాలి" అనేసి ఇద్దరు కానిస్టేబిల్స్‌తో లోపలికొచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"హే! భగవాన్ ! ఏమిటీ పరీక్ష ?" మనస్సులో గొణుక్కున్నాడు.

బీరువాలో చీర మడతల్లో వున్న డబ్బు బైటికి తీస్తూ "మీ కీ డబ్బెక్క...

దుఃఖం కట్టలు తెంచుకుంది.

"నేనా పని చెయ్యలేదు. చేయని నేరానికి శిక్ష వాకా! నా మాట వినండి. ఇన్స్పెక్టర్. నిజాన్ని తెల్సుకోండి! నమ్మరా? నన్ను నమ్మలేరా? అయ్యో భగవంతుడా..." అంటూ బాధగా మూలుగుతూ మంచంమీద పడుకున్న సుందర్రామయ్యగారిని భార్య తట్టి నిద్ర లేపుతూ "ఏమండీ! ఏమిటి కలవ రిస్తున్నారు? ఏమండీ! మిమ్మల్నే ..." అంది.

"ఆఁ ... కాంతా! .. ఏమిటీ, పిల్చావా?" కళ్ళు తెరిచి ప్రక్కకు వొత్తిగిల్లారు.

"అవునండీ! ఏమిటీ నిద్రలో మీలో మీరు మాట్లాడుకుంటున్నారు?"

"ఏంలేదు కాంతా! జీవితం నన్ను బలహీనపరుస్తున్నది. నన్నూ, నా పరి స్థితిని చూచి డబ్బు వెక్కిరిస్తూ నన్ను బానిసగా చేసుకోవాలని చూస్తోంది

తెచ్చిన గ్లాసెడు నీళ్ళు గటగటా తాగేసి, ముఖాన్ని తుండుతో తుడుచు కుని "కాంతా, ఇలా రా! నా ప్రక్కగా కూర్చో!"

"ఏమిటండీ?"

"చూడు కాంతా! నేను మంచి వాడినే నంటావా?"

"భలేవారండి! మీరు నిజంగా దేవుడు లాంటివారు. ఏం? ఎందు కట్లా అడుగుతున్నారు?"

"మరేం లేదు నా మీద నాకు నమ్మకం పోతున్నది. పైగా పీడకల కూడా వచ్చింది."

"అనవసరంగా అధైర్యపడకండి! అన్నిటికీ భగవంతుడే వున్నాడు. కళ్లు మూసుకు పడుకోండి!"

"అంతే కాంతా అంతే" అనేసి మళ్ళీ నిద్రకు ఉపక్రమించారు సుంద ర్రామయ్యగారు.

***






**మీరు మృదువుగా వేపొరబ్ రాస్తే అది వెంటనే వెచ్చదనాన్నిచ్చి హాయిని గొలుపుతుంది....మీపిల్లవాడు సులభంగా శ్వాసను పీల్చుకొని రాత్రంతా హాయిగా నిద్రపోతాడు.**

బాధ నివారణకు మీ పిల్లవాడు మీ మీద ఆధారపడతాడు.
అతడు రొంపతో బాధపడుతున్నప్పుడు విక్స్ వేపొరబ్ రాయండి.
రాత్రి గొంతుక [illegible]

# గ్లామర్... గ్రామర్

* *

## సుకన్యతో ప్రత్యేక గోష్ఠి




సినిమా రంగంలో గ్లామర్ కున్న విలువ మరి దేనికీ లేదు. వయసు మళ్ళిన తారలుకూడా గ్లామర్ కోసమే తెగ కలవరిస్తూ వుంటారు. వయసు మళ్ళిన భూమికలయినా, పేదపాత్ర అయినా మిసిమిలో వున్నట్లు, పెల్కలో మునిగి తేలుతున్నట్లు కనపడానికి ప్రయత్నించడం కద్దు.

యువతారలను తల్లి, అమ్మమ్మ పాత్రలు ధరించమంటే ఒక పట్టాన ఒప్పుకోరు. చాలామంది అసలే ఒప్పుకోరుకూడా. ఆ రోజుల్లో "నాయిల్లు"లో నాగయ్యగారు తన భార్య భూమికకు "చంద్రలేఖ" టి. ఆర్. రాజకుమారిని ఒప్పించడానికి పడిన ప్రయాస అంతా యింతా కాదు.

అమ్మ, అమ్మమ్మ పాత్రలేమిటి అక్క, అయిదోతనం లేని యువతి భూమికలకు తారలచే "యస్" అనిపించడం సాధారణంగా సాధ్యం కాదు.

ఇదంతా నిన్నటి తరంవారి సొద. ఈ తరంవారిలో ఎవరెవరి వైఖరి ఎటువంటిదో ఖండితంగా చెప్పలేముగాని యవ్వనపు పొంగు మిసమిస లాడే తార సుకన్య మటుకు 'గ్లామర్' "గ్రామరే" మార్చి సు (మంచి) కన్య అనిపించారు.

"ముసలి పాత్రలకు" దడిసే ఘటం కాదు ఇది. హీరోగారి అమ్మ వేషమే కాదుకదా ఆమెగారి అమ్మమ్మగారి నాయనమ్మ వేషం వేయడానికైనా నేను సిద్ధమే" అని ఆమె ఘంటాపథంగా చెప్పారు.

విశాల నేత్రాలతో, వన్నె బంగారం ఛాయతో, వయసును చిన్నచేసే మిసిమితో సుకన్య మాట్లాడుతూనే ముసలి వేషం వేస్తే ప్రేక్షకుల దృష్టిలో ముసలి వాళ్ళమైపోతామని అనుకోడం ముసలి. మహా ముసలి మనస్తత్వం అని అన్నారు.

"జ్యోతి" మద్రాసు ప్రతినిధితో మాట్లాడుతూ తెరకొచ్చాక, తారయ్యాక ఏ భూమిక ధరించేందుకైనా సిద్ధపడాలి. అన్ని రకాల పాత్రలు నిర్వహించినప్పుడే కళాకారిణికి సర్వ సంపూర్ణమైన సంతృప్తి వుంటుంది. నాలో

యవ్వనం వుంది. వుంటుంది. ముక్కాళ్ళ ముసలమ్మ వేషం వేసి నంత మాత్రాన నాపై ప్రేక్షకుల మోజు తగ్గదు. ముసలమ్మగా నేను కనిపించి, నటించి, ఒప్పించకలిగితే నాపై ప్రేక్షకుల మోజు పెరుగుతుందేకాని తరగదు, కరగదు, విరగదు" అని ఆమె మాట విరచి విరచి పలికారు.

గోష్ఠి రసపట్టులో పడిన మీదట మా యిద్దరి మధ్య జరిగిన సంభాషణ, వాక్ సంఘర్షణ, భావ ఘర్షణ వివర మిది. (కవ్వింపైతేకాని మనసులోని నిజం కదలదు, మెదలదు, వదలదు కాబట్టి ప్రశ్న ఉద్దేశమే అది అని గమనించ ప్రార్థన.)

నేను : గ్లామర్ లేని సినిమాలు (తారలు కూడా) సోదిలోకి రాకుండా పోతున్నాయి.

సుకన్య : పొరబడ్డారు. ఈ మధ్య విడుదలైన అరడజను చిత్రాలలో గ్లామర్ లేని ఒక సినిమా డబ్బు చేసు కొంటున్నది.

ప్రశ్న : అయితే చలన చిత్రం విజయం 'గ్రామర్' ఏమిటి ?

జ : మంచి కథ, మంచి దర్శకుడు, మంచి నటన _ గ్లామరస్ నటన కాదు సుమా.

ప్ర : మంచి కథ వుండి, మంచి దర్శకుడు వుండి, గ్లామర్‌లేని మంచి నటన మీరిచ్చి, చిత్రం డబ్బుచేసుకొనక పోతే మీ రేంచేస్తారు ?

జ : కళ ఖర్మ అని గ్లామరస్‌గా ఏడుస్తా.

ప్ర : అయితే మీరిప్పుడు నటిస్తున్న చిత్రాలలో మీ కా మహాభాగ్యం కలిగించేది ఏదైనా వుందా?

జ : మీ దయవల్ల లేదనే అనుకొంటాను.

ప్ర : అయినా, దయచేసి చెబితేనే, నేను, పాఠకులు నమ్ముతాము.

జ : సుకన్య కాదు. యక్ష కన్య !

ప్ర : అదేమి ? ఏమా కథ.

జ : "ఇద్దరు మొనగాళ్ళు" జానపద చిత్రంలో యక్షకన్య భూమికను ధరించాను నా భాగం చిత్రీకరణ అయిపోయింది.

ప్ర : ఇంతకీ అది గ్లామరస్ భూమికేగా.

జ : తప్పకుండా. సొగసులోనే విసుగు చూపవలసి వచ్చింది. మాంత్రికుడివద్ద వుంటాను. కీలుబొమ్మను. ఇష్టంలేని పనులన్నీ నా చేత చేయిస్తాడు. సత్యవంతుడైన క్షత్రియుణ్ణి తీసుకురమ్మంటాడు. ఆ తీసుకురావడం, ఒకందుకు తెచ్చి మరోలా నేనే _ భావించడం, తుదకు నే ననుకొన్నంత జరిగి, నాకు విముక్తి కలగడం అంతా విక్టరీ విశలాచార్యగారి స్టయిల్ లో జరిగి పోతుంది.

ప్ర : మరొక స్టయిల్ ఏమయినా వచ్చిందా ?

జ : వస్తున్నది. డి. బి. ఎన్. వారి "ప్రయివేట్ మాస్టార్" లో.

ప్ర : అందులో మీరు మిస్ట్రెస్సా ?



జ: కాదు. కృష్ణకు జోడీ. చాలా వరదా అయిన భూమిక. విలచే పాత్ర. విలబడే నటన.

ప్ర: ఏమా కథ?

జ: పైకి అమాయకురాలుగా కనిపిస్తా. కాని కార్య సాధకురాల్ని. అవసరమైతే ఎవరికైనా ఎదురు విలచి సమాధానం చెప్పగలను. ఈ సుకన్య అందులో సాహస కన్యం డోయ్.

ప్ర: "రంగుల రాట్నం" వనజ కూడా చాలా సాహసపు రంగులు వేయబోయి, వేసి, తుదకు తెల్లముఖం చూపిందిటకదా!

జ: తెల్లముఖం కాదు. తెల్ల హృదయం.

ప్ర : ఏమా కథ ?

జ : వనజ ధనవనంలో పెరిగింది. గారాబమే ఆమెకు గాలీ, వెలుతురూ. అయినా చదువుకొంది. అయినా అహం భావం గర్వం జోడు గుర్రాలయ్యాయి.

ప్ర : ఎవరిపైన స్వారీ చేశాయి.

జ : భర్తపైన. అత్తపైన. ఎంత పెత్తనంవున్నా ఆడది గృహిణి ఆజ్ఞానోదయమే తెలుపు హృదయంలో రగిలి ముఖంలో చూపించి

ప్ర : మరేముఖమైనా చూపిస్తారా ?

జ : ఆ, కొత్తది.

ప్ర : ఏమా కథ ?

జ : సాంఘిక, జానపదాలైనాయి. పౌరాణికానికి పరుగులిడుతున్నా.

ప్ర : మీ తరం నటులను తెరపై కలుసుకొనేందుకేనా ?

జ కాదు. అందులోనూ త్తి రుచి వుంది.

ప్ర : ఏమా సంగతి ?

జ : రామమోహన్, కాంతారావు కృష్ణలతో కలసి నటించాను ఇప్పుడు "కృష్ణావతారం"లో కృష్ణునికి జాంబవతిని.

ప్ర : అర్థమైంది. పేరు ప్రఖ్యాతులు కల నటుల ప్రక్కకూడా ధుమాయించి నటించగలనన్న ధైర్యం మీకు వుందా ?

జ : అనుభవం లేనిదే చెప్పలేను.

ప్ర : అనుభవం లేకుండానే సినిమా తార కాగలిగినప్పుడు, సాహస కన్య వేషాలు వేయగలుగుతున్నప్పుడు, గ్లామర్‌పై పెద్ద తారల మాటలే కాదన గలిగినప్పుడు ఈపాటి ప్రశ్నకు సమాధానం చెప్పలేని కన్య సుకన్యా ?

జ : తప్పకుండాను. ఇంకా నేను పాఠాలు నేర్చు నే దశలోనేవున్నాను.

ప్ర : ఇప్పటికి ఎన్ని అయినాయి ?

జ : నాలుగు తేనెమనసులు. కన్నె మనసులు రంగుల రాట్నం. ఇద్దరు మొనగాళ్ళు.

ప్ర : పరీక్ష లయ్యాయా

జ : ఆఁ, నాలుగింటిలోనూ

ప్ర : రెండు విడుదలే కాలేదు. పాతమో, ఘనపాతమో ఎలా చెప్ప గలుగుతారు

జ : చెప్పగలను. మార్కులతో సహా.

ప్ర : మార్కులు వేసింది దర్శకుడా ? ప్రేక్షకులా ?

జ : నాకు నేనే !

ప్ర : ఈ పరిక్ష మరీ బాగుంది. స్వయంగా మార్కులు వేసుకొనడం.

జ : తేనెమనసులు కంటె కన్నె మనసులకు ఎక్కువ మార్కులు వేసుకొన్నాను. ఆ పాత్రలో నా విజయ నగరం యాస బాగా కలసివచ్చింది. రంగుల రాట్నం వనజకూ ఎక్కువ మార్కులు వేసుకొన్నాను.

ప్ర : ఆదుర్తి చిత్రాలలో కంటేనా



"మోహిని భస్మాసుర"లో పద్మిని - రంగారావు

---

జ: మన్నించండి. స్వయం పరీక్షలో నేను తప్ప మరెవ్వరూ రారు. అదుర్తిగారు మాచేత అ, ఆలు దిద్దించిన గురువులు. వారు చెప్పింది చేశామా, లేదా అనేదే పరీక్ష చేశాము. వారుకాక వేరొక డైరెక్టర్ వద్ద పని చేసే అవకాశం "రంగుల రాట్నం"లో లభించింది. చెప్పింది చెయ్యడమేకాక మంచో, చెడో స్వయంగా ఏమైనా చెయ్యకలిగానా అనేదే పరీక్ష. అంచేతనే ఎక్కువ మార్కులు స్వతంత్రంగా వేసేసుకున్నాను.

ప్ర: మరి యక్షకన్యను అలానే వదిలేశారే?

జ: అది చిన్న భూమిక. ముగ్గురి భామలలో ఒక రేఖ. జానపదం కొంత కొత్త. మొదట్లో కొత్త. అంచేత విఠలాచార్యగారు చెప్పింది చేసెయ్యడమే మా వంతు.

ప్ర: మొత్తానికి దొరికారు. "కృష్ణావతారం" పౌరాణికం కదా. మీకు కొత్త కదా. లోగడ జాంబవతి ప్రస్తావన వచ్చినప్పుడు, మీ మంచి ఈ రకమైన సమాధానం ఎందుకు రాలేదు?

జ: జానపదంవలె పౌరాణికం కొంత కొత్త. మొదట్లో కొత్త. మొద

ళ్లోనే కొత్త. ఏ చిత్రమైనా, ఏ భూమిక అయినా డైలాగులు కొద్ది రోజులే పట్టి స్తాయి. అలవాటయితే ఏ భయమూ లేదు. జాంబవతిగా ఇంకా సెట్స్‌కు వెళ్ళందే మార్కులు ఎలా వేసుకో మంటారు, మాష్టారూ ?

---



శ్రీ తిరుమలా పిక్చర్సువారు
తయారు చేస్తున్న ప్రథమ జానపద
చిత్రంలో నాయికగా
కె. ఆర్. విజయ

ప్ర : మీకు మీరు మార్కులు వేసుకోవడమే కాదు. పెద్దలకు మీచేత మార్కులు వేయిస్తా చూడండి.

జ : ఏమా కథ ??

ప్ర : మీరు రెండుతరాల దర్శకుల వద్ద పని చేశారు కదా!

జ : వివరించండి.

ప్ర : బి. యన్. రెడ్డిగారు, విఠలాచార్యగారు చాలాకాలంగా ఫీల్డులో వున్నవారు. విశ్వంగారు, ఒక విధంగా ఆదుర్తిగారు ఈ తరం వారు. ఏదో ప్రయోగం అంటూ రాకెట్ విసురుతారు. ఈ రెండు తరాలవారిలో ఎవరి వద్ద నటించడం మీకు సులభం? ఎవరు మీ నుంచి ఎక్కువ ప్రజ్ఞ తీసుకొనకలిగారు ?

జ : ఇందాకే అన్నాను. ఆదుర్తిగారేమిటి. విశ్వంగారేమిటి, ఇలా చెయ్యండి అని అంటే అలా చేసే శిష్యురాలిని నేను. బి. యన్. రెడ్డిగారు, విఠలాచారిగారు విషయంలో పద్ధతి వేరు.

ప్ర : అందుకనే అడుగుతున్నది. ఎవరు ఎక్కువగా నచ్చారని ?

జ : బి. యన్. గారు, విఠలాచారిగారు నన్ని వేళ సందర్భంలో వివరించి ఇది ఇలా అది అలా అని చెప్పేవారు. నాకు అర్థమైనంతలో నటించేదాన్ని. నాకు చేతనైనంతలో స్వంత ప్రజ్ఞ చూపేదాన్ని, వారు ఊహించింది నేను ప్రదర్శించకలిగినందువల్ల



విజయసారధి వారి "వీరపూజలో" మల్లాది - కాంతారావు

కాబోలు 'యక్షకన్య రాట్నం' సాఫీగా తిరిగింది.

ప్ర: ఆదుర్తి, విశ్వంగారల విషయమో మరి?

జ: వారికున్న ఓపిక చెప్పజాలం. ఇంకొకళ్ళు ఇంకొకళ్ళు అయితే మేమిక్కడ వుండేవాళ్ళం కాదేమో! పిల్లలకు పాఠాలు చెప్పినట్లు, చిలుకకు పలుకులు చెప్పినట్లు ఎన్నెన్నో వివరించి ప్రతి అంశంలోని ప్రతి అణువు తెలియజెప్పేవారు. అంచేత....

ప్ర: కొత్త తరం గొప్ప!
జ: ............
ప్ర: పాత తరం గొప్ప!
జ: ............
ప్ర: ............

జ: ఎవరి రీతి వారిది! అందరి రీతి అణకువతో, మెలకువతో పాటించే తార సుకన్య - అంటే, నేను కాదు. మంచి తార అన్నమాట మాష్టారూ!!!

# ఆంధ్ర ప్రతినిధివర్గం సోవియెట్ యాత్ర

సోవియట్ రష్యాలో భారత చలన చిత్రోత్సవంలో పాల్గొనేందుకై జాగృతి చిత్రవారి "పదండి ముందుకు" చిత్రం తరఫున దర్శకుడు వి. మధుసూదనరావు. దుష్టపాత్రధారి గుమ్మడి వెంకటేశ్వరరావు. నాయిక జమున నవంబర్ 13 వ తేదీన మద్రాసునుంచి విమానంలో బయలుదేరి వెళ్ళారు. వీరు ఢిల్లీ చేరుకొని, మిగతా చిత్రాల ప్రతినిధులతో కలసి రష్యా వెళ్లారు.

ఈ ముగ్గురికీ రష్యా యాత్ర ఇదే మొదటిసారి, గుమ్మడి చలన చిత్రోత్సవాల ప్రతినిధిగా విదేశాలు వెళ్ళడం ఇది మూడవసారి. దగ్గుబాటి, ఆదుర్తి "నమ్మిన బంటు"; గంగాధరరావు, పి. ఎస్. రావు "కీలుబొమ్మలు"; కృష్ణమూర్తి, జగ్గయ్యల "పదండి ముందుకు" ఆయన్ని విదేశాల ముందుకు తోశాయి.

చివరి క్షణంవరకు గుమ్మడి రష్యా వెడతారా, లేదా అన్నది సందేహంగానే వుంది. తుదకు ఆయన వెళ్ళడం ఖాయమయ్యేసరికి ముందు పత్రికా విలేఖరులను కలుసుకొని ఆనంద వార్త అందజేశారు.

ఆంధ్ర ప్రతినిధులు ముగ్గురూ దాదాపు రెండువారాలపాటు సోవియట్ రష్యాలో ప్రభుత్వ అతిధులుగా వుంటారు. ఏ మాత్రం అవకాశం వున్నా తూర్పు ఐరోపా రాజ్యాలు కూడా సందర్శించాలని వీరు, ముఖ్యంగా గుమ్మడి కలలుగంటున్నారు.

డిసెంబర్ మొదటి వారంలో మద్రాసుకు తిరిగి రాగలరని ప్రస్తుతపు కార్యక్రమంబట్టి తెలుస్తున్నది.

దాదాపు 16,000 అడుగుల "పదండి ముందుకు" చిత్రాన్ని 9,800 అడుగులకు కుదించి. రష్యను భాషలో కథాంశం మాత్రం జోడించి ఒక్క ప్రింటును సోవియెట్ రష్యాకు తీసుకొని వెళ్ళారు.

నవంబర్ 15 న మాస్కోలో భారత చలన చిత్రోత్సవం ప్రారంభమైంది. దరిమిలా లెనిన్‌గ్రాడ్, బాకూ, మిన్‌స్క్‌లలో కూడా జరిగింది.

క్రింది ఫీచర్ చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి:

ఛెమిన్ (మలయాళం), షహీద్, తుహి మేరి జిందగి అర్జూ (హిందీ), అతిథి (బెంగాలీ).

డాక్యుమెంటరీ చిత్రాలు: ది విక్లిన్స్ వన్‌డే, కైలాస్ ఎట్ ఎల్లోరా, హాకీ, ఇన్విటేషన్ - టు ఎన్‌ఛాట్‌మెంట్, హిమాలయన్ లేక్స్, వైల్డ్ లైఫ్ ఇన్ ఇండియా.



మధు పిక్చర్స్‌వారి "ఇద్దరు మొనగాళ్ళు"లో

కృష్ణ - కృష్ణకుమారి

## సర్ప రాక్షసితో కాంతారావు పోరు

మధు పిక్చర్స్‌వారి "ఇద్దరు మొనగాళ్ళు" జానపద చిత్రంలో సర్ప రాక్షసితో కాంతారావు పోరాటం చిత్రీకరించారు. ఛాయాగ్రహణ దర్శకుడు రవికాంత్ మంచి పనితనం చూపారు. అంతకు ముందు షెడ్యూలులో సుకన్యపై భక్తిరస గేయం ఒకటి చిత్రీకరించారు. తారాగణం వివరమిది :

కాంతారావు, కృష్ణ, సంధ్యారాణి, సుకన్య, నెల్లూరు కాంతారావు, రావి కొండలరావు, సారధి, సత్యనారాయణ, పుష్పకుమారి, డి. తిలకం, కాశీనాధ తాత, రమణారెడ్డి, ముఖ్య నాయకురాలు కృష్ణకుమారి.

దర్శకుడు విఠలాచార్య. రచన పీటూరి, నిర్మాత మల్లికార్జునరావు.

# భూలోకంలో యమలోకం

ఒక రాజకుటుంబంవారు స్వార్థపరులై చేసిన అన్యాయాలకు సజీవులై వుండగానే నరకం ప్రత్యక్షంగా అనుభవించేందుకు రాజవాహనుడు (కాంతారావు) అనే రాకుమారుడు భూలోకంలోనే యమలోకం సృష్టించిన తీరు గౌరీ ప్రొడక్షన్స్‌వారి "భూలోకంలో యమలోకం" ప్రధాన కథ

జానపద చిత్రాలలో పై అంశమే కొత్తదనం కలది

ఆ కొత్త అంశానికి మామూలు జానపదాల ఆకర్షణలన్నీ జోడించారు ఈ ఆకర్షణలలో రవ్వంత కొత్తదనం కలది వివాహితుడై కూడా బ్రహ్మచారిగా వుండే రాకుమారుని ఒక మాంత్రికుడు బలి యివ్వదలచడం

రాజవాహనుడు కన్యావతిని (రాజశ్రీ) ప్రేమించి ఒక మోసంవల్ల మదనరేఖను (ప్రసన్న లక్ష్మి) వివాహమాడినందువల్ల పరోక్ష బ్రహ్మచర్యం అవలంబించవలసి వస్తుంది అలా కాక, వరించిన వనితనే వివాహమాడి ఏదో ఒక ప్రళయంవల్ల ప్రత్యక్ష బ్రహ్మచర్యం పాటిస్తే చిత్రానికి, కథకూ మాంత్రికుని లక్ష్యానికి బలం ఏర్పడి వుండేది

నటీనటులలో రాజనాల ఊహించని ఉత్తమ నటన ప్రదర్శించడం, గేయ చిత్రీకరణలో రెండు మూడు సందర్భాలు రెండు మూడు జానపద రీతి పాటల సంగీతం ప్రత్యేకించి మెచ్చుకో దగ్గవి।

ఈ 16 రీళ్ళ చిత్రం యూనిట్ వివర మిది

తారాగణం కాంతారావు. రాజనాల. డాక్టర్ ప్రభాకరరెడ్డి మిక్కిలినేని. బాలకృష్ణ కోళ్ళ సత్యం. రాజశ్రీ. ప్రసన్నలక్ష్మి. పుష్పవల్లి. వాణిశ్రీ మొదలైనవారు

కథ సినీ అనుసరణ· ఎస్ భావనారాయణ, నిర్మాత వై వి రావు, సంభాషణలు జి కృష్ణమూర్తి ఛాయాగ్రహణం వేణు కళ మీనన్, కూర్పు కె ఎస్ ఆర్. దాస్. దర్శకుడు జి విశ్వనాథ్, సంగీతం: కోదండపాణి

* * *

## "ప్రయివేటు మాష్టారు"

టి బి ఎన్ వారి "ప్రయివేట్ మాష్టారు" మొదటి షూటింగు షెడ్యూలు నవంబర్ ఆరంభంలో పూర్తి అయింది నవంబర్ మధ్యలో వారికి షెడ్యూలు నిర్ణయమైంది రామమోహన్, కృష్ణ కాంచన, సంధ్యారాణి మొదలైనవారు ముఖ్య పాత్రలు ధరిస్తున్నారు కొమ్మారెడ్డి రామకృష్ణరావు స్వతంత్ర ఛాయాగ్రహణ దర్శకునిగా పరిచయం చేస్తున్న ఈ చిత్రానికి విశ్వం దర్శకుడు కథ, సంభాషణలు ముళ్ళపూడి వెంకటరమణ సమకూర్చారు



శ్రీకాంత్ ప్రొడక్షన్స్‌వారి "చిన్నమ్మ" చిత్రంలో దేవిక

## చలన చిత్ర వార్తలు

### "భక్త ప్రహ్లాద"

ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మాణంలో వున్న ఈ చిత్రం షూటింగు జోరుగా సాగుతూ వుంది శేఖర్‌గారి కళానైపుణ్యంలో నిర్మించిన బ్రహ్మాండమైన "ఇంద్రసభ" సెట్టులో ప్రస్తుతం గీతాంజలి, నిర్మల విజయలలిత కాంతలు రంభ, ఊర్వశి మేనక తిలోత్తమలుగా అద్భుతంగా "అందవి సురసీమ నీదే' నంటూ హిరణ్యకశిపుని ముందు నాట్యం చేస్తున్నారు

ఈ చిత్రం డిశంబరులో విడుదల. దర్శకత్వం చిత్రపు నారాయణమూర్తి. రచన డి వి నరసరాజు

సంగీతం ఎస్ రాజేశ్వరరావు.

### "అవే కళ్ళు"

కాంచన, కృష్ణ, రాజనాల, గీతాంజలి పద్మనాభం, నాగభూషణం నటించే ఈ చిత్రంలో వారం రోజుల క్రితం మైసూరు ప్రాంతాలలో అద్భుతమైన (ఈస్ట్‌మన్) కలర్ దృశ్యాలను ఘంటసాల సుశీల పాడిన పాటలతో చిత్రీకరించారు దర్శకత్వం త్రిలోకచందర్. రచన డి వి నరసరాజు.

## వీరబ్రహ్మం చరిత్ర సినిమా కథ

ఎస్. బి. ఫిలిమ్స్‌వారి "కాలజ్ఞానం" అనే వీరబ్రహ్మం జీవిత చరిత్ర చిత్రానికి సినిమా కథ వివరాన్ని పింగళి నాగేంద్రరావు సిద్ధపరిచారు. ఇక దృశ్య విభజన జరుగవలసి వుంది. అనంతరం సంభాషణలకు ఉపక్రమిస్తారు. కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం వహించే ఈ చిత్రానికి ఘంటసాల సంగీత దర్శకుడు. నిర్మాతలు డాక్టర్ స్వామి, సుబ్బారావు



ఇందిరా రమణా పిక్చర్సువారి "సత్యమే జయంలో" రాజశ్రీ

## "పూల రంగడు" మొదటి షెడ్యూలు పూర్తి

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి "పూలరంగడు" మొదటి షూటింగు షెడ్యూలు హైదరాబాదు సారథి స్టుడియోస్‌లో నవంబర్ ఒకటవ తేదీనుంచి 10వ తేదీవరకు జరిగింది. నాగేశ్వరరావు (పూలరంగడు), జమున, శోభనబాబు మొదలైనవారు ప్రథమ చిత్రీకరణ ఘట్టంలో పాల్గొన్నారు. దుక్కి-పాటి మధుసూధనరావు నిర్మిస్తున్న ఈ కొత్త తరహా చిత్రానికి ఆదుర్తి సుబ్బారావు దర్శకుడు. తారాగణంలో యింకా గుమ్మడి, సూర్యకాంతం, విజయనిర్మల, పద్మనాభం, చలం, గీతాంజలి మొదలైన వారున్నారు. చిత్రీకరణ దశకు ముందు తుంగభద్ర తీరంలో సంగీత దర్శకుడు ఎస్. రాజేశ్వరరావు. ఆరు పాటలకు బాణీలు కట్టారు. నవంబర్ ద్వితీయార్థంలో మద్రాసులో ఇవి రికార్డు చెయ్యబడుతాయి. మళ్ళీ డిసెంబర్ ఒకటవ తేదీనుంచి దాదాపు ఒక పక్షంపాటు షూటింగు జరుగుతుంది. మిగిలిన సాంకేతికవర్గ వివరమిది:

కథ: ముళ్ళపూడి వెంకటరమణ. సంభాషణలు: ముప్పాళ రంగనాయకమ్మ. కెమెరా: సెల్వరాజ్. కళ: జి. వి. సుబ్బారావు.

## "సతీ సుకన్య"

ఎవర్ గ్రీన్ మూవీస్‌వారు "సతీ సుకన్య" పునర్నిర్మించబోతున్నారు ఇదే పేరిట కన్నడచిత్రం తయారవుతున్నది.



శ్రీ రంగా అండ్ చిత్రాంజలివారి "కృష్ణమహిమ"లో
కృష్ణుడుగా కాంతారావు - రుక్మిణిగా అంబిక

---

"రాము"

రామారావు కె. ఆర్. విజయతో కలిసి "రాము" చిత్రంలో నటించబో తున్నారు. ఇతర తారాగణం రేలంగి, పద్మనాభం మాస్టర్ రాజ్‌కుమార్ లతో త్వరలో సెట్సుకు పోబోతోంది. దర్శ కత్వం : త్రిలోకచందర్. రచన : డి. వి. నరసరాజు.

"కేరళ కన్య"

జాస్మిన్ పిక్చర్స్ అనే మద్రాసు సంస్థ "మిస్ కేరళ" అనే మలయాళ చిత్రం నిర్మించబోతున్నది. కథకుడు వయలున్సర్, దర్శకుడు శివన్.

పద్మశ్రీ చిత్రం

పద్మశ్రీవారు అమరమైత్రిపై చిత్రం తీస్తున్నారు. ప్రాణమిత్రుల మధ్య రేగిన పరమ శత్రుత్వ పరి ణామాలు చిత్రించే ఈ చిత్రంలో మిత్రులుగా నాగేశ్వరరావు, జగ్గయ్య నటిస్తున్నారు. తారా బృందంలో ఇంకా గుమ్మడి, సావిత్రి, కాంచన, కాంత కుమారి, రావి కొండలరావు మొదలైన వారున్నారు. నిర్మాత : వి. వెంక టేశ్వర్లు, దర్శకుడు : పి. పుల్లయ్య, రచన : ముళ్ళపూడి, కెమెరా : సెల్వ రాజ్.

## "మిలాన్" విశేషాలు

"మూగమనసులు" హిందీ వర్షను "మిలాన్"కు సంబంధించిన కొన్ని ఘట్టాలు లోగడ హైదరాబాద్‌లో చిత్రీకరించారు. రవీంద్ర భారతికి అందులో ప్రాధాన్యం వుండడం మరొక విశేషం. గోదావరి ప్రాంతంలో కూడా చాలా ఘట్టాలు చిత్రీకరించారు. ఆంధ్ర దేశంలో ఈస్ట్‌మన్ కలర్‌లో ఇంత ఎక్కువ భాగం షూట్ చెయ్యబడిన హిందీ చిత్రం మరొకటి లేదు. నవంబర్ చివరి వారంలో దర్శకుడు అదుర్తి బొంబాయి వెళ్ళి మరికొంత కార్యక్రమం నిర్వహించారు. నిర్మాత ఎల్. వి. ప్రసాద్.

## "శ్రీ కృష్ణావతారం"

తారకరామా పిక్చర్స్‌వారి "కృష్ణావతారం" నిర్మాణం శరవేగంపై సాగుతున్నది. ఈ మధ్య శిశుపాల వంచన ఘట్టం తీశారు. అంతకు ముందు కృష్ణుడు, సత్యభామలపై (రామారావు, కాంచనలపై) రెండు పాటలు చిత్రీకరించారు. మళ్ళీ నవంబర్ రెండవ వారం నుంచి షూటింగ్ జరుగుతున్నది.

చిత్రంలో ఒక ప్రత్యేక ఆకర్షణ, విశేషాకర్షణ, రామారావు కుమారుడు హరికృష్ణ చిన్న కృష్ణుడుగా నటించడం. దర్శకుడు కమలాకర కామేశ్వరరావు, నిర్మాత పుండరీకాక్షయ్య, రచన సముద్రాల రాఘవాచార్య, కళ గోఖలే, ఛాయాగ్రహణం అన్నయ్య, సంగీతం టి. వి. రాజు.

## "భువన సుందరి కథ" మొదటి షెడ్యూలు

శ్రీదేవి ప్రొడక్షన్స్‌వారి "భువనసుందరి కథ" నిర్మాణం నవంబర్ 14 వ తేదీన వీనస్ స్టుడియోస్‌లో ప్రారంభమైంది. జయశ్రీ నృత్యాన్ని మొదట చిత్రీకరించారు. ముఖ్యనటుడు రామారావు. చిత్ర నిర్మాత తోట సుబ్బారావు, దర్శకుడు సి. పుల్లయ్య, కథ జి. వి. జి. సంభాషణలు బి. ఎల్. ఎన్. ఆచార్య, పాటలు దాశరధి, సి. నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం ఘంటసాల. కెమెరా పి. నాగేశ్వరరావు, కళా దర్శకుడు వాలి, కూర్పు గోపాలరావు.

తారాగణంలో రంగారావు, ఉదయకుమార్, సత్యనారాయణ, ధూళిపాళ, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, కృష్ణకుమారి, వాణిశ్రీ, ఛాయాదేవి వున్నారు. విడుదల : ఏప్రిల్.

## కృష్ణకు రాజకపూర్ భూమిక

కొలది సంవత్సరాలక్రితం హృషికేష్ ముఖర్జీ హిందీలో తీసిన "అనాడి"ని ఉదయశ్రీ పిక్చర్స్ అనే సంస్థ "అమాయకుడు" పేరిట హైదరాబాద్‌లో పునర్నిర్మించ దలచింది. హిందీలో రాజకపూర్ నిర్వహించిన భూమికను తెలుగు చిత్రంలో కృష్ణ ధరిస్తారు. ఇంకా జమున, గుమ్మడి, జి. వరలక్ష్మి, రేలంగి తారాగణంలో కలరు. సంగీతం బి. శంకరరావు. కెమెరా యు. రాజగోపాల్, దర్శకుడు ఏ. నారాయణరావు.



"వీరపూజ' చిత్రంలో కాంతారావు - జి. వరలక్ష్మి - రేలంగి

---

## డిసెంబర్‌లో జయంతి జానపదం

జయంతి పిక్చర్స్‌వారి జానపదం షూటింగ్ స్క్రిప్టు సిద్ధమై ది. డిసెంబర్‌లో సెట్స్‌కు వెడుతుంది. రామారావు బి. సరోజాదేవి ప్రధానపాత్రలు ధరించే ఈ చిత్రానికి పింగళి నాగేంద్రరావు మాటలు, పాటలు సమకూర్చారు. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు. దర్శకుడు కె. వి. రెడ్డి. జెమిని స్టుడియోస్ నిర్వహణాధికారిగా వున్న హాలీవుడ్ గ్రాడ్యుయేట్ పి. శ్రీనివాసన్ చిత్ర నిర్మాణ కార్యక్రమ సారధిగా వుంటారు.

## ఫిలిం నిడివి తగ్గింపులేదు

బొంబాయి కలకత్తాలు కూడా కలసి వచ్చిన మీదటే మద్రాసు, హైదరాబాద్‌లు ఫిలిం నిడివిని 4,000 మీటర్లకు పరిమితం చేసుకోవాలని దక్షిణ భారత ఫిలిం వాణిజ్య మండలి కార్యవర్గం ఇటీవల ఒక ముఖ్య తీర్మానం చేసింది.

• • •

కమలాకర కామేశ్వరరావు ఎమ్ ఎస్. పిక్చర్స్‌వారి "శంకు చక్రధారి" దర్శకత్వం వహించబోతున్నారు సముద్రాల రాఘవాచార్య సంభాషణలు సమకూర్చుతున్నారు.

## రంగారావు స్వంత చిత్రం

ఎస్. వి. రంగారావు ఎస్. వి. ఆర్. సంస్థ నెలకొల్పి సాంఘికం తీస్తున్నారు. దర్శకుడు: నందనరావు. రచన, డి. వి. నరసరాజు గుమ్మడి రమణారెడ్డి, జమున సూర్యకాంతం తారాగణంలో కలరు.

* * *

వెంకటేశ్వరస్వామిపై వి. జి. కె. చారి రచించిన రెండు పాటలను సుశీల పాడగా కొలంబియా వారు నవంబర్ 15 న రికార్డు చేశారు. ఆధ్వర్యం: పెండ్యాల.



మధు పిక్చర్స్‌వారి "ఇద్దరు మొనగాళ్ళు" లో సంధ్యారాణి

## విజయా చిత్రం ప్రారంభం

విజయా ప్రొడక్షన్స్‌వారి "ఉమ - చండి - గౌరీశంకరులు" చిత్రనిర్మాణం వాహినీ స్టుడియోలో నవంబర్ మూడవ వారంలో ప్రారంభమైంది. శంకరునిగా రామారావు. చండి, గౌరిగా బి. సరోజాదేవి నటిస్తున్నారు. మాటలు, పాటలు పింగళి నాగేంద్రరావు దర్శకత్వం కె. వి. రెడ్డి నిర్మాతలు: నాగిరెడ్డి - చక్రపాణి.

## మొదటి షెడ్యూలు జరిగిన "కులగోత్రాలు"

కె. ఎస్. పిక్చర్స్‌వారు "కులగోత్రాలు" హిందీలో ఈస్ట్‌మన్ కలర్‌లో తీస్తున్నారు. బొంబాయిలోని రూప్‌తారా స్టుడియోస్‌లో నవంబర్ రెండవ తేదీన షూటింగ్ ప్రారంభమైంది. కె. ప్రత్యగాత్మ ఈ హిందీ చిత్రాన్నికూడా డైరెక్టు చేస్తున్నారు. మాలాసిన్హా, బిశ్వజిత్, శశికళ, దేవన్ వర్మ, నజీమా, అచల సచదేవ్, అశిత్ శేన్, సులోచన మొదలైనవారు తారాగణంలో కలరు. సంగీత దర్శకుడు హేమంతకుమార్. కె. ప్రత్యగాత్మకు ఇది రెండవ హిందీ చిత్రం. మొదటిది "ఛోటా బాయి." నవంబర్ 11 న ఈ చిత్రం విడుదలైంది.

***

Edited and Published by V. V. Raghavaiah
and Printed by him at Jyothi Printers
Congress office Road, Governorpet, Vijayawada-2